కోపానలమునుండి నిన్నుఁ గాపాడుటకుఁ గడ కావైకుంఠవాసుఁడేని చాలఁడుసుమా!" అని వాసుదేవుఁ డాతనితోఁ జెప్పెను.

కమ:—నావలన నీకేమి కార్యము కావలయును?

వాసు:—చేసెదనని మాటయిమ్ము.

కమ:—కార్యస్వభావము నెఱుంగుటకుఁ బూర్వమే మాటయిచ్చుటెట్లు?

వాసు:—నీతోడివాదమునకు నాకుఁ దీఱికలేదు. నామాట చెల్లించుటకు నీకు సమ్మతమైనయెడల, నట్లు వాగ్దానమొనరింపుము." లేకున్న నీయిష్టము ననుసరించి యావెనుకఁ బర్యవసానము ననుభవింపుము. కాని, రాజద్రోహులు హూణులచేతఁబడుబాధ లెట్టివో నీకుఁ దెలియఁజేయుట యుక్తమని నాకుఁ దోఁచుచున్నది.

"హూణుఁడు వారలఁ దుదముట్టించు ననుకొనియెదను" అని కమలాక్షుఁడు వణఁకసాగెను.

వాసు:—అంతసులభముగా, నంతయనాయాసముగాఁ జంపుననుకొంటివా! ఆనిర్భాగ్యు లంతమొందుటకు సందియములేదుగాని, చెప్పరానిచిత్రవధలకుఁ జిక్కికాని చావరు. ముందు వారిభుజములవెడల్పు గొలుతురు. తరువాత వెన్నెముకపై మొదలిడి, వీఁపుపైనుండు చర్మమునంతయు నొలిచివేయుదురు. అనంతరము మిరపగుండయందు లవణముగలిపి, వీఁపంతయుఁ బూయుదురు. అప్పుడు నీటికణములు వీఁపంతట నూరును. తరువాత గనగనలాడు యినుపకమ్ముల నాభాగముపైఁ బొర్లించి యానీటిబిందువులఁ దొలఁగింతురు.

కమలాక్షునకుఁ జిత్తవిభ్రమము గలిగెను. "అయ్యో! దైవమా! ఘోరములగు నిట్టిశిక్షల నేను వినఁజాలను." అని యాతఁ డఱచెను. కాని వాసుదేవుఁ డాతనివేదనను లెక్కకుఁగొనక, యాశిక్షావిపులీకరణమున కువ్విళ్లూరుచు "అంతతోఁ బోదు. ఇనుపకమ్ములచేఁ గాల్చినపిదప, నెఱ్ఱగాఁ గాల్చిన పటకారులఁ బెత్తురు, మిగిలినయంగముల చర్మములఁగూడ నొలిచి, పటకారు

లతో వానిని గాల్తురు. అంతటఁ గుడిచేతిని నెలగుదురు. పిదప నెడమచేతిని ఛేదింతురు. ఆపిదప రెండుకాళ్లను మోకాళ్లవఱకు ఖండింతురు. ఆవెనుక రెండుతొడలను మొలలవఱకుఁ గత్తిరింతురు." అని మాటనిలుపక, మాట చెప్పుచుండెను.

కమలాక్షుఁడు బావురుమని యేడ్చుచుండెను. "ఓస్వామీ! ఓతండ్రీ! నీమాటప్రకారము నడుచుకొందును. ఓమహాప్రభూ! ఘోరమగు నిట్టిశిక్షల నుండి నన్నుఁ గావుము." అని యాతఁడు బ్రతిమాలుచుండెను. కాని వాసుదేవుఁ డాబానసీని పరిదేవనములఁ జెవులఁబెట్టక "ఉండుము. అంతయు వినుము. తొడలఁ గత్తిరించినంతట, జెవులుకోయుదురు. పిదప నొకమొద్దు కత్తితో ముక్కు నెలగివేయుదురు. ఆతర్వాత నొకకంటియందు మిరపపొడిఁ బోయుదురు. దానిబాధచే నాతఁడు తపించుచుండఁగా, రెండవకంటియందుఁ గూడఁ జల్లుదురు. అనంతరము........." అని యాతఁడుసాగుచుండఁగాఁ గమలాక్షుఁడు కంటికిఁ గడవెడుగా నేడ్చుచు "అయ్యయ్యో! ఓస్వామీ! ఓస్వామీ! ఈభయంకరశిక్షలనుండి నన్నుఁ దప్పింపుము. ఏమైననేమి! నీయానతి మాళిఁదాల్తును" అని బతిమాలుచుండును. కాని కఠోరహృదయుఁడు వాసుదేవుఁ డాతని కుయ్యాలింపక "తరువాత గనగనలాడుపటకారులఁ దెచ్చి ముందొకకంటిని, యావల రెండవకంటిని బెఱికివేయుదురు. అంతయు నైన పిదప మిగిలియుండుదేహము నొకపెనముపై నుంచి, పొయ్యిపైఁబెట్టి మెల్ల మెల్లగాఁ బ్రాణవాయువులనాబొందినుండి తఱిమివేయుదురు."అని చెప్పెను. కమలాక్షున కిట్టి పాడుకథలు క్రొత్తలుగాకున్నను, ఈఘోరశిక్షావిధుల నాకర్ణించి మూర్ఛమునిఁగెను. వాసుదేవుఁ డాతనిముఖమునఁ జన్నీటిఁ జిలకరించి సేదఁదేర్చెను. కమలాక్షుఁ డాతనియడుగులఁబడి పేరెలుఁగున "ఓస్వామీ! నీయిష్టానుసారము వర్తించెదను. నీవు వర్ణించిననరకమునుండి నన్ను లేవనెత్తుము" అని వేడుకోసాగెను.

వాసు:—అట్లే కానిమ్ము! ఆవచ్చియుండురౌతు మాళవరాజగు యశోధర్మయని నీకుఁ దెలియునా?

'ఏమీ! అటులనా!' అని కమలాక్షుఁడు విస్మయపరీతుఁడై ఱాతిబొమ్మవలె నిలిచిపోయెను.

వాసు:—అవును. ఆయువకుఁడు యశోధర్మయే. ఇది నిస్సందేహము. నేనెవఁడనో నీకుఁ దెలియునా? తోరమాణునకు నమ్మినబంటును. 'యశోధర్మ బాలాదిత్యులెక్కడ నగపడిన నక్కడనే మట్టుపెట్టవలయును' అని నాకు రాజాజ్ఞయున్నది. కాని యశోధర్మ నాకంటె బలాధికుఁడు. అతనిమార్కొనుటకు నాకిపుడు శక్తిచాలదు. రాత్రిపూట నాతఁడు నిద్రించుచుండ చంపవచ్చు ననుకొనిన, నదియు సాధ్యము కాదు. రాత్రియంతయు నాతఁడు కుక్కవలె నప్రమత్తుఁడై యుండును. ఇదియుఁగాక, ఆతనివెంటనుండు యతులిద్దఱుగూడ రాత్రియంతయు మేల్కొనియుందురు.

కమ:—అయిన నేమి చేయుమనియెదవు?

వాసు:—అదియే చెప్పఁబోవుచున్నాను. ఒక్కమాటలోఁ జెప్పెదను. నీవు యశోధర్మకు విషముపెట్టవలయును. అందుకు నీకు ౧౦౦ బంగారునాణెములు బహూకరింతును. ఈకానుకతో నీవీపాడువృత్తి వదలి సుఖింపవచ్చును.

ఈకడపటివాక్యములకుఁ గమలాక్షునివదనాంబుజము వికసించెను. కాని మొదటిప్రార్థనావాక్యమునకుమాత్ర మాతనిహృదయము క్రుంగిపోయెను. ఆతం డొకించుక యోజించి "అబ్బబ్బ! ఈపని మిగుల నసహ్యము. చాల ఘోరము. నీవొసంగుపారితోషికము నీవు తలంచునంత యాకర్షణీయముగాలేదు. ఏదియెట్లున్నను, నావద్ద పాషాణమేదీ!" అని పలికెను.

"నాకడనున్నది. దానికై దిగులులొందకుము." అని వాసుదేవుఁ డొక చిన్నపొట్లమునుదీసి, విప్పి, యందుండు తెల్లనిచూర్ణము నాతనికిఁ జూపుచు "తెలియునా? ఈచూర్ణము చాల దారుణమైనది. దీనితో నిరువదిమందిని జంపవచ్చును." అని చెప్పెను.

కమ:—అటులనా? నీవు నాకాజ్ఞాపించుకార్యము మిగుల నీచమైనది.

వాసు:—దీని నెరవేఱ్చునట్లింతకుముందే నీవు బాసచేసియున్నావు.

కమ:—కార్యస్వభావము నెఱుంగుటకు ముందుకదా!

"అయిన మంచిది. అనినమాటఁదప్పి, పర్యవసానము ననుభవించుము" అని వాసుదేవుఁడు పోఁబోయెను.

కమలాక్షునకు ముచ్చెమటలుపోసెను. "అయ్యో! స్వామీ! పోకుఁడు. పోకుఁడు మీమాట వినియెద. కాని యీ ౧౦౦ బంగారునాణెములకంటెఁ గొంచె మెక్కువమాత్రము దయసేయుము" అని యాతఁడు ప్రార్థించెను.

వాసు:—మంచిది. నెత్తురుమీఁదిడబ్బు నిచ్చుటకు మాకు నెట్టియభ్యంతరములేదు. ౧౫౦ గా నిచ్చెదను.

కమ —౨౦౦ అయిన దయచేయుము. అని పండ్లికిలించెను.

"౧౫౦ కెక్కువ యొక్కదమ్మిడియైన నియ్యను. ఒప్పుకొనినసరి. లేకున్న దానిపర్యవసాన మనుభవింపుము." అని వాసుదేవుఁడు ఖండితముగాఁ బలికెను.

కమ:—అయిన సొమ్మెక్కడ? ఇమ్ము.

వాసు:—పనియైనపిదప నిచ్చెద. కాని దానిని నీకు ముందుగాఁ జూపెదను.

అనియాతఁ డొకమూటవిప్పి రెండుమూఁడువందలబంగారునాణెములఁ జూపెను. 'సర్వేజనాః కాంచనమాశ్రయంతి' అనుట యనుభవముకదా! సర్వశక్తివంతమగు సువర్ణసందర్శనమునఁ గమలాక్షుఁడు వికసితనేత్రుండయ్యెను. ఆతనిమానసము నరికట్టుప్రతిబంధములన్నియు నొక్కమారుగా వీఁగిపోయెను. ఆతనిసంతసము వెల్లివిరిసెను. "౧౭౫ అయిన నిండు. మీపనిఁ దూచాతప్పక నెఱవేర్చెదను" అని యాతఁ డనెను.

కమలాక్షుఁడు తనచేతఁ జిక్కినాఁడని వాసుదేవునకుఁ దెలియును. ౧౫౦ రూకల కాతఁడు సంతృప్తుఁడైనదియుఁగూడ నాతనికిఁ దెలియును.

కమ:—నీ వెవఁడవో నే నెఱుంగనగు నా?

వాసు:—నా పేరు వాసుదేవుఁడు. నాయది యాథేయదేశము. హూణునకుఁ గూర్చసచివుఁడను.

"ఓహో! అవునవును." అని యావంటవాఁ డంతయుఁ నెఱింగినట్లు నటించెను.

కమ:—ఆయతులిద్దఱినీఁగూడఁ దుదముట్టించిన మంచిదనుకొనియెద. లేకున్న, దేశద్రిమ్మరులగువారీవిషప్రయోగోదంతమును దేశదేశములఁ జాటుదురు.

వాసు:—ఆభయమువలదు. ఇట్టివ్యాపారములు హూణున కీనాఁడు క్రొత్తలుగావు. కాని యాయతుల నిద్దఱినిగూడ నంతమొందించుట మంచిదని నీతలంపైనచో నందులకు నాయాక్షేపణ మేమియులేదు.

కమ:—ఈపైపనుల కేమిచ్చెదవు?

వాసు:—పెద్దసున్న. వారినిఁ జంపినఁ జంపుము. వదలిన వదలుము. అది నీయిష్టము.

కమ:—అటులైన, వారిని జీవములతో వదలివేయవలయునని నా యభిప్రాయము.

వాసు—అది నీయిష్టమంటినిగదా! నేఁబోయివారితోఁ గలిసియుండెదను. మాటయిచ్చితిని. ఏమఱుదువేమో! జాగ్రత! అని యాతఁడు వంటయిల్లు విడిచిపోయెను.

# పంచదశోత్తరశతతరంగము.

## వసంత.

వాసుదేవుఁడు పోయినపిమ్మటఁ గమలాక్షుఁడు మరలఁ దలుపులుమూసి బంధించెను.

"భళిభళీ! ఇపుడు నేనేమిచేయవలయును? నాయట్టిబ్రాహ్మణుఁడెక్కడ? ఐదుమందిని హత్యగావింప నుండుటెక్కడ? అబ్బబ్బా! ఎంతఘోరము! ఎంత ఘోరము! నాపూర్వులెవ్వరుగానియొక్కనినైన హత్యయొనరించినవారుగారు. కాని నేనుమాత్ర మిప్పు డిచటఁ నైదుగురఁ జంపనున్నాను. ఇంతయేల! నిజమాడ వలయునన్న, నాముత్తాతతమ్ముఁడొకమానవునిహత్యగావించినాఁడు. కాని యా పరిస్థితులువేఱు. అప్పుడు కన్యాకుబ్జరాజ్యమును విగ్రహరాజనుయువకుం డేలు చుండెను. ఆతనిపినతండ్రి యారాజ్యమును లాగుకొన నెంచి, యారాజకుమా రుని హత్యగావించుటకై, నాప్రపితామహుని సోదరునిఁ బ్రేరేపించెను. దాని కాతఁడు సమ్మతించి, విగ్రహరాజును బరలోకమునకుఁ బంపెను. కాని యా తండాయొక్క హత్యకుమాత్రము ఏనూఱుహేమనాణెములఁ బడసినాఁడు. నేనో! ఐదుహత్యలకు రెండువందలుమాత్రము పొందుచున్నాను; ఇన్నూరు బంగారునాణెములకాశనొంది, ఘాతుకుఁడౌట యుచితమా! ఏమో నాకుఁ దెలియదు. నేఁజెప్పఁజాలను... ఔనౌను. హంతకుఁ డనుపేరు మిగుల నీచ మైనది... అయిన నన్నట్లు పిలుచువారెవరు? ఈసంగతి యొరుల కెట్లు తెలి యును?... ఆహా! ఆసన్యాసులకుఁ దెలిసినఁ దెలియవచ్చును. తెలిసిన నేమి? నేను జోళదేశమునకో, పాండ్యరాజ్యమునకో, కేరళరాష్ట్రమునకో పోయి, స్థిరనివాస మేర్పరుచుకొందును... అకటకటా! అయిన నాజన్మభూమిని వదలి

పోవలయుఁగదా? మాళవదేశమెక్కడ? పాండ్యభూమి యెక్కడ? జన్మభూమిని వదలిపోవుటకంటె దుఃఖకరము మఱేమున్నది? మడువు వట్టిపోయినందుచే స్థలాంతరమునకుఁబోయిన మొసలిసైతము, మరల నయ్యది నీటిచే నిండినతోడనే తిరిగివచ్చుట సహజముగదా! నే నా మొసలికంటె నీచుఁడనా? ఇదియటుండఁ, జోళపాండ్యరాజ్యములందు నన్నుఁ బ్రేమతోఁ జూచువారెవరున్నారు? ఇచటిజీవితమునకు నచటిజీవితమునకు నెంతయో వ్యత్యాసము గలదు. అచటి యాచారములు వేఱు; వ్యవహారములు వేఱు; మతములు వేఱు. కడకు దైవములు, పిశాచములుగూడ సుస్థిరములుగా నిలిచియుండును. అట్టిచోట నేను నిలుచుటెట్లు? కాని నావద్ద నప్పు డిన్నూరు బంగారునాణెము లుండును. అదియే నాయోగక్షేమము లారయుచుండును...... కాని యెంతబంగారముండియు నేమి ప్రయోజనము? అనురాగమును విలుచుకొను శక్తి దానికున్నదా? ఎందుకులేదు?... కాని కొనితెచ్చుకొనిన ప్రేమ యప్పటముగా నుండదు. ఇంతయేల? నాజీవమణి వసంత యున్నదిగదా! మేమిరువురముగలిసి దక్షిణదేశమునకేలపోరాదు? ఆపడఁతితోఁ బ్రస్తావించెద. ఆ చిన్నది గోపికాంగన. నేనో బ్రాహ్మణుఁడను. అయిన నేమి? దాక్షిణాత్యులు వర్ణవిభేదముల నంతగాఁ బాటింపరు. ఇఁక వసంతయో! ఆతొయ్యలి ముద్దులుమూటఁగట్టుచుండును. ఆచిలుకలకొలికి కచట బాంధవు లెవ్వరునులేరు. పొట్టకూటికై ఱెక్కలు విఱుచుకొనుచుండును. కాన నానవలామణి, నన్ను వెంబడించుట కెట్టి యాటంకము చెప్పదు. కమలాక్షునిపై నాకమలాక్షి ప్రేమ యద్వితీయము. ఆముద్దులగుమ్మ యిచటికిఁ బాలను దెచ్చినప్పు డీసంగతిఁ బ్రస్తావించెద. పొయ్యిపై నుండి పాత్రలు దించవలయును.'' అని యాతఁ డనుకొని, యాపాత్రలు దించి యాపదార్థముల నుప్పుకారము చేర్చి కలియఁబెట్టెను.

మరల నాతఁ డీవిధమునఁ దలపోసికొనసాగెను. ''ఈవిషము నేపదార్థమునఁ గలపవలయును? ముద్దపదార్థములయందుఁ జేర్చినయెడల నయ్యది బాగుగఁ గలియదు కాఁబోలు! అందుచేఁ గార్యభంగమగును. చావఁగూడని

వాఁడు చచ్చును. కాన నద్దాని నొకద్రవపదార్థమునందుఁ గలుపుట కార్య కారి. ద్రవపదార్థ మేమున్నది? మంచినీరుండలేదా! నేనెంతమందమతిని. ఇదియే సుళువగుమార్గము. ఇందులకుఁ బ్రయత్నించెదను." అని యాతఁడు వాసుదేవుఁడిచ్చిన విషపుఁబొడిని, యతిథులుత్రాగుటకై తెచ్చియుంచిన నీటి యందుఁ గలిపెను. ఆచూర్ణ మంతలో నీటియందుఁగలిసి మాయమైపోయెను. నీటిరంగుకూడ నించుకేని మాఱలేదు. కమలాక్షుఁ డాజలము నవలోకించుచు ముక్కుపై వ్రేలిడికొని "ఎంతచిత్రము! ఎంతచిత్రము! ఎంతసుళువుగా, సున్నితముగాఁ గఱఁగిన దీచూర్ణము. నీటిరుచి యేమైన మాఱినదేమో?" అని యనుకొనెను. కాని యానీటిని జవిజూచుట కాతనికి నిబ్బరముకలుగ దయ్యెను.

కమలాక్షుఁ డాగంగాళమునందలి దారుణపాషాణద్రావకము నవలోకించుచు దానికడ నాసీనుఁడై "నా యీవాగ్దానమువలన నాకు నరకము గలుగునా? అవునని మనుశాస్త్రకర్త చెప్పినాఁడు. శాస్త్రములు గూడ దానిని బలపఱచుచున్నవి. కాని వారందఱు చెప్పెడువారే కాని, చేసెడు వారుగారు. ఆనీతు లాచరణమున కయోగ్యములు. ఇంతయేల? రాజకీయ ప్రపంచమునందు విషప్రయోగ మనుచితము కాదని, నావలెనే చాణక్యుఁడు గూడఁ దలంచుచున్నాఁడు. రాజకీయపరిస్థితులు వేఱు. న్యాయబద్ధములగు సాంఘికనియమావళిచే, రాజకీయనౌకను నడుపఁజాలము. అట్లు కాదనినచో, నేఁటిరాజులఁ బెక్కుమందిని తూఁకుమానుకడకుఁ బంపవలసియుండును. ఏరాజవంశమైనను జూడుము. హత్యాకళంకరహితమైనది లేనే లేదు. ఇట్టి రాజాన్వయము లొకదానిని మించి వేఱొకటియున్నవి. ఇంతయేల? మహాత్ముఁడగు నశోకమహారాజుసైతము, రుధిరారుణమగు సింహాపీఠి నధిష్ఠించియుండెనని చెప్పవలసియున్నది. ఏలయన, నందుల వధించి కదా, చంద్రగుప్తుఁడు రాజ్యమువడసినాఁడు. ఆకార్యమును మనము సాంఘికప్రపంచమున హత్యయని యందుము. కాని రాజకీయప్రపంచమున

హంతకశిఖామణి వీరోత్తంసుఁడని ప్రఖ్యాతిఁగాంచును. ఇఁక నే నీసంది యములఁ జిమ్మివేయనగును. అది యటుండ, నిట్టిపాడుపని నేదియో యొక దానిఁ గావించిన నేతప్పు, నాకు రెండువందలబంగారునాణెము లెట్లువచ్చును? నూఱేండ్లపాటు వంటపనిఁజేసినను, ఈవిత్తము నార్జింపఁగలనా?...సత్య దేవత సౌజన్యవిహీనురాలు. ఆమెఁ గొలుచుటవలన నుపయోగము సున్న. నాకెవరైన రెండువందలుకాదు—వందబంగారునాణెము లిచ్చినఁజాలును; సదాచారసత్వముల కణఁగి మణఁగి నడుచుకొనుచుఁ దృప్తినందియుండెదను. కాని యేనూఱునాణెము లిచ్చుపెద్దమ్మయేఁడీ? నూఱుకాదు; ఏఁబదిచాలును. కడ కిరువదియైనఁజాలును. ఆధర్మాత్ముఁడేఁడీ?......ఓకమలాక్షా! ఒక్క మాట వినుము. సత్యమార్గమున సంపాదనములేదు.....అదియుఁగాక, హూణశిక్షాభీతిచే నే నీహత్యాకార్యముల కొడిఁగట్టుచున్నాను. ఈపాప కృత్యము నామనసునఁ బుట్టినదికాదు. తెలియకచేసినపాపమునకుఁ బరలోక మున శిక్షలేదని పెద్దలందురు. తప్పించుకోలేక చేసినపాపమునకుఁగూడ నా నియమము చెల్లుఁగదా! ఎందు కన్వయింపదు? ఈహూణుఁడు నిరంకుశుఁడు. ఆతనివలనిభయము నాకు మిక్కుటమైయున్నది. ఈతనిపాలనమున నాదారి ద్ర్యము మేరమీఱియున్నది. ఈరెండును జేరి నన్ను నలిచివేయునని నాసంది యము. నాచేతుల నాలుగుదుగ్గానులు మెదలుచుండినయెడల, నిట్టి నీచ కార్యమునకుఁ గలనైనఁ దలపెట్టియుండెడివాఁడఁగాను. ఇచటికి నిన్నటిదిన మొకబౌద్ధపరివ్రాజకుఁ డరుదెంచియుండి "ద్రోహాచరణముకంటె ద్రోహ చింతనమే విశేషపాపప్రదము" అని బుద్ధుని యుపదేశమని నాతోఁ జెప్పి నాఁడు. నే నీహత్యాప్రయత్నముల నీవఱకే తలపెట్టితిని. ఇఁక హత్య యొనరించుటవలన రానుండు విశేష పాప మేమున్నది? ఉత్రవడియముగా నిన్నూరుబంగారు నాణెములు వచ్చుచుండ, నీపిచ్చితలంపు లెందులకు? నేను వాసుదేవున కొనరించినవాగ్దానము నెఱవేర్చు టాత్మక్షేమంకరము." అని నిర్ధారించుకొనెను.

ఈవిధమున నాతఁడు దీర్ఘాలోచనసముద్రమునుండి బయటఁబడెనో లేదో, ఎవరో తలుపుఁదట్టుశబ్ద మాతనికి విననయ్యెను. 'ఎవరచట?' అని యాతఁడు గద్గదికతోఁ బ్రశ్నించెను.

"ఎవరులేదు." అని సమాధానము.

కంఠస్వరమునుబట్టి యావ్యక్తి యొకస్త్రీయని గ్రహించి, కమలాక్షుఁడు కుదుటఁబడెను. "ఓహోహో! వసంతవచ్చినది. వసంతవచ్చినది." అని యాతఁ డుప్పొంగి 'వసంతా!' అని మాఱుపలికెను.

"అవును. నేనే వసంతను. మఱెవ్వ రనుకొంటివి?"

కమ:—మఱెవ్వరున్నారు? అంతమాత్రము నాకుఁ దెలియదాయేమి?

"అయినఁ దలుపుతీయుము." అని యావనిత నొక్కిపలికెను. కాని యాతం డింకను నస్థిరమానసుఁడై యుండెను.

"వంటయింటితలుపులు మూసియుంచితి వెందులకు? లోన నంతఃపుర రహస్యము లేమైన జరుగుచున్నవా యేమి?" అని యాగోపిక యధికార సూచకముగాఁ బ్రశ్నించెను.

కమలాక్షుఁడు కలవరమొంది "ఇంకేపనులకును దలుపులు మూసి యుంచఁగూడదా?" అని ప్రత్యుత్తరమిచ్చెను.

"ఆహా! కూడదని యెవరందురు? కాని వంట చేయునపుడు తలుపులు మూసియుంచవలసినంత యవసర మేమున్నది? తలుపులు తెఱచినసరి. లేకున్నఁ బాలతోఁ దిరిగిపోదును."

ఆబెదరింపునకుఁ గమలాక్షుఁడు గవాక్షముతీసెను. ఒంటివత్తిదీపపు సెమ్మె యాతనిచేతనుండెను. ఆగుడ్డివెలుతురునం దాగోపసుందరి సౌకుమార్య విలాససంపద కాన నగుచుండెను. ఆమెకు రమారమి యిరువదేండ్లుండును. భాద్రపదమునందలి తరంగిణివలె నాతరుణీమణి సౌందర్యరాశి యుభయ కూలముల నొఱసి ప్రవహించుచుండెను. ఆకోమలిప్రవాళాధరముల మంద హాసము చిందులు ద్రొక్కుచుండెను. ఒకమందస్మితము మాయమగుచు మఱి

యొకమందస్మితమును దెచ్చి విడుచుచుండెను. వనధివీచికలకువలె, వసంత సుందరసుకుమారమందహాసముల కంతము లేకుండెను. వాని మొదలుతుదలకు విరతి లేకుండెను. సామాన్యముగా సృష్టిపొందుమార్పులవలె, నొకచిఱునవ్వు పొడ వడంగుట, మఱియొకటి పొడముటకుఁ గారణమైయుండెను. ఇఁక నీవనితకు 'వసంత' అనుపేరు తగియుండెను. వసంతకాలసోయగములన్నియు నాచిన్న దానియందు మేళవించి తోఁకాడుచుండెను. నవయౌవనాంగియగు నా గొల్లపడుచు ముఖాంబుజము సరళతకావాసమై, సకలలోకసమ్మోహనకరమై ముద్దులు మూటఁగట్టుచుండెను. పలుచబాఱి నిలుకడఁగాంచిన మెఱుపుఁ దీఁగెవలె నుండుతనూలత—సువాసనాసంభరితములగు విరులసరులచే నిండి యుండుతుఱుము—పసియాఱవవన్నె కుందనమును గేరుశరీరకాంతి—వాడని మందహాసచంద్రికలు—అన్నియు శ్రీకృష్ణునికాలపు గోపికఁ దలపింపఁ జేయు చుండెను. రూపొందినయారోగ్యలక్ష్మివలె వసంత విలాసముగ నిలిచియుం డెను. చంద్రసందర్శనమునఁ జంద్రకాంతముకరఁగి, వసంతసందర్శనమునఁ గమలాక్షుని శిలాకఠినహృదయము కరఁగుచుండును. ఆతఁడామెను మోహిం చినవాఁడుకాఁడు. తరుణుల నెట్లు మోహింపవలయునో యాతని కించుక యైనఁ దెలియదు. కాంతలయెదుటఁ బడినపుడంతయు గుండె దడదడఁగొట్టు కొనుచుండియుఁ, గంటఁబడిన కాంతలచుట్టును గుక్కలవలెఁ దిరుగు వెడఁగు లెందఱో గలరు. కమలాక్షుఁ డట్టివారిలో మేలుబంతియనిచెప్పిన దోషము కాదు. కాని సాధారణముగాఁ బ్రతిదిన మాతఁడు వసంతనుదప్ప మఱేవని తను జూచుచుండఁడు. అందుచే నాతనియనురాగవల్లిక మఱియొకయెడకుఁ బ్రాఁకుటకుబదులు, వసంతనే యాధార మొనరించుకొనియుండెను.

ఆమె తెచ్చినక్షీరమును గమలాక్షుఁడు తీసికొనెను.

వసంత:—నేఁడు చాలమంది వచ్చినట్లున్నారు.

కమలాక్షునియొదలు జల్లుమనెను. "అవును"

వసంత:—ప్రాకారమున రెండుహయము లున్నవి. అవి యెవరివి?

కమ:—ఏమో! నాకుఁ దెలియదు.

వసంత:—తెలిసియుండవలయును. తెలియకపోవుటెట్లు? నీకుఁ దెలియక యిచటఁ జీమయైనఁ జిటుకను నా?

కమలాక్షుఁ డుబ్బి తబ్బిబ్బులయ్యెను. "ఆగుజ్జము లెవరివైనవి నాకుఁ దెలియును. కాని నేను జెప్పఁజాలను."

"ఏమీ! నాకుఁ జెప్పననుచున్నావా?" అని వసంత కఠినముగాఁ బలికి "అయిన నిప్పుడేపోయెదను. రేపటినుండియు నేను క్షీరము తీసికొని రాను. నాతమ్మునిఁ బంపెదను. ఆహా! నన్నుఁజూచిన నీకింత చులకనయైనది కదా!" అని నిష్ఠురములాడెను. ఆసుందరాంగి కన్నులనుండి జొటజొట నీరు గారుచుండెను. అకస్మాత్తుగాఁగురియు వసంతకాలపు వానజల్లువలె మిలమిల మను బాష్పవారికణము లాకోమలాంగి నయనవారిదములనుండి ధరణి కురలుచుండెను. ఇఁక నాజలజనయన పోఁబోయెను. అంతలోఁ గమలాక్షుఁడు వసంతా! వసంతా! పోవలదు. పోవలదు. అంతయుఁ జెప్పెదను." అని బ్రతిమాలెను. క్షణములో వసంతవదనారవిందము వికసించెను. దరహాస కౌముది లామె మోమునందలి శోకాంధకారమును జిమ్మివేసెను. వాన జల్లు వెలిసినపిదప వెలుఁగొందుభానుబింబమువోలె, నాభామిని మనోజ్ఞరూపముఁ దాల్చియుండెను. ఆగొల్లచిన్నది చెప్పలద్దుకొనుచు "అవును. నీవు చెప్పెదవని నాకుఁ దెలియును. కానిమ్ము." అని యడిగెను.

కమ:—నాకుఁ దెలిసినంతమట్టుకుఁ జెప్పెద. ఒకయశ్వము వాసుదేవుఁ డనువానిది. ఆతఁడు యాదవుఁడు. తోరమానమహారాజున కాతఁడు ప్రియసచివుఁడు.

వసంత:—ఇంకొకగుఱ్ఱము?

కమ:—వసంతా! నీవు సప్తగంగలతోడుగాఁ, ద్రిమూర్తులతోడుగా, రహస్యమును గాపాడునట్లు బాసచేసిన నేతప్ప నీకాసంగతి నెఱింగింపఁజాలను.

వసంత:—అట్లే యొట్టు పెట్టుకొందును. సప్తగంగలు, త్రిమూర్తులు, విశ్వేశ్వరుఁడు, వీరితోడుగా నీమర్మమును దాఁచియుంచెదనని యిదే బాస చేయుచున్నాను.

"అది, మహాకోసలమాళవప్రభువగు యశోధర్మగుప్తము" అని కమలాక్షుఁడు మిగుల రహస్యముగా నామె చెవిలోఁ జెప్పెను.

వసంతకు విస్మయమయ్యెను. "ఏమీ! అయ్యది మాళవాధిపుఁడు యశోధర్మయశ్వమా! ఆత్మగర్భశాత్రవుని ప్రియసచివుఁడుండు కప్పక్రిందనే, యశోధర్మకూడ నెట్లున్నాఁడు?" అని యాకోమలి యడిగెను

కమ:—ఆతఁడు వాసుదేవుఁడని యశోధర్మకుఁ దెలియదు.

వసంత:—అయిన నీతఁడు యశోధర్మ యని వాసుదేవునకుఁ దెలియునా?

కమ:—ఆహా! తెలియును.

కమలాక్షుఁడు! నాలుక కొఱుకుకొనెను. నోరుజాఱితినని యాతఁడు గ్రహించి, యంతలో నామాటను ద్రిప్పనెంచి "తెలిసియుండు ననుకొనియెదను" అని చెప్పెను.

వసంత:—ఆతనికిఁ దెలియునని నీవు బాగుగా నెఱుంగుదువు. నీవు నాచెవులకుఁ బిడకలుకట్టఁ జూచుచున్నావా?

కమలాక్షునకు దిగులయ్యెను. ఆతని ప్రజ్ఞాకౌశలము మొద్దువాఱెను. ఆతం డితికర్తవ్యతావిమూఢుఁడై యుండెను. "వసంతా! నన్ను నాశమొనరింపకుము" అని యాయనద యాయబలను బ్రతిమాలసాగెను.

వసంత:—నీవనునదేమి? నాకు నీపరిచయముకలిగి పదియేండ్లయినది కాని; నేఁటి నీవర్తనముమాత్రము నాకర్థమగుటలేదు.

కమ:—వసంతా! అంతయు సిద్ధముగానున్నది. నాకుఁ గాలము కలిసివచ్చినయెడలఁ గొలఁదిదినములలోనే నిచటినుండిఁ బోనున్నాను.

వసంత:—ఏమీ! మమ్మందఱ విడిచిపోయెదవా?

దానికి వగచి యుపయోగమేమి? ఆతఁడా కార్య మొనరింపక విధిలేదు. కాన నాతండించుక దిటవు దెచ్చుకొని "వసంతా! ఈవిషయముమాత్రము నన్నడుగకుము. దీనికి రాజకీయములతో సంబంధముకలదు" అని నుడివెను.

వసంత:—మంచిది. నీవు నాకాసంగతిఁ జెప్పకపోయినచో, నాతరువాత నీకగుగతి నీకుఁ దెలియునా?

అని యామె పోఁబోయెను. కమలాక్షుఁడు తండడిలాడుచుండెను. ఆతనికి వెనుకఁబోయిన నూయి, ముందుఁబోయిన గోయిగా నుండెను. ఎటులైననేమి? తాను వసంత మది కెక్కవలయునని యాతఁడు నిర్ధారించుకొనెను. "వసంతా! వసంతా! రమ్ము. పోవద్దు. అంతయుఁ జెప్పెదను." అని యాతఁ డఱచెను.

వసంత:—అయినఁ జెప్పుము. మాయమాట లిఁకఁ జెల్లవు. ఉన్నఁదున్నట్లు వినిపింపుము.

కమలాక్షుఁడు కంపితస్వరమునఁ దిన్నగా "ఇది నిజము. యశోధర్త్రాగెడుపదార్థములోఁగాని, తినెడు నాహారములోఁగాని యొకవిషపుఁబొడినిఁ గలిపినచో, వాసుదేవుఁడు నాకిన్నూరు బంగారునాణెములు బహూకరించునట్లు మాటయిచ్చినాఁడు." అని చెప్పెను.

వసంతగుండె జల్లుమనెను. "ఇందులకు నీవియ్యకొంటివా?"

కమ:—మఱి విధియేమున్నది? సమ్మతింపకపోయినచో, హూణులు నన్నుఁ జిత్రవధలఁబెట్టుదురని యాతఁడు బెదరించినాఁడు.

వసంత:—అయిన రెండువందలఁ బంగారునాణెములకు నీవమ్ముడువోతివి.

కమ:—ఈరహస్యమును గాఁచునట్లు సప్తగంగలతోడుగాఁ, ద్రిమూర్తులతోడుగా బాసచేయుము.



వసంత కమలాక్షునియెదుట నోట్టు పెట్టుకొనెను.

పుట—233.

వసంత:—నేఁజేయను. నీవు ఘాతుకకృత్యమునకుఁ బూనియు న్నావు. అట్టియెడ నేను బాసచేయుట ధర్మసమ్మతము కానేరదు.

కమ:—అయిన నీవు కృతఘ్నురాలవు. రహస్యముగాతునని నీవు మాటయిచ్చినందుచేత నేకదా, నీకాయుదంతము వినిపించితిని. దీని నొరుల చెవులవైచితివేని, నీమానమేపోవును. మీఁదుమిక్కిలి, నీవు తమకార్యముల కడ్డుతగులుచున్నావని హూణులకుఁ దెలిసినయెడల, వారు నలుగురిలో నీ మానముఁ దీసికాని వదలరు. తెలియునా?

ఈబెదరింపుల కాయబల కించుక దిగులుపుట్టెను. హూణు లన్నంత పనిఁ జేయువారని యాతలోదరికిఁ దెలియును. ఇఁకఁ ద్రాడు తెగువఱకు లాగ రాదని యామె యనుకొని, కమలాక్షునియిష్టానుసారము బాసచేసెను.

వసంత:—కమలాక్షా! ఇప్పుడైనఁ జెప్పుము. ఆవిషమును దేనిలో గలిపితివి?

కమ:—ఒట్టుపెట్టుకొనుము.

వసంత మరల నొట్టుపెట్టుకొనెను.

కమ:—త్రాగెడునీటిలోఁ గలిపితిని. దానివలన నీటిరంగుకూడ మాఱలేదు.

వసంత గంగాళముకడకుఁబోయి యందలిజలముఁ జూచెను. "ఆహా! ఈప్రపంచమునం దీనీటినిఁబోలిన, పాలసు లెందఱో యున్నారుగదా!" అని యాపడఁతి నివ్వెరఁజెందెను.

కమ:—ఆచూర్ణముతో నిరువదిమందినిఁ జంపవచ్చునని వాసుదేవుఁడు నాకుఁ జెప్పినాఁడు.

వసంత:—ఉండవచ్చును. దానికిఁ జాలమహిమ యుండును. ఆచూ ర్ణమే యీకమలాక్షున కిన్నూరుబంగారునాణెములఁ బ్రసాదించుచున్నదికదా!

కమ:—అవును.

ఆతనికి నవ్వు పెల్లగిలుకొనివచ్చెను. కాని యాతనిభయోద్రేక మద్దానిఁ ద్రొక్కిపెట్టెను. హృదయమువిచ్చి నవ్వుట కాతనికి ధైర్యము చాలలేదు.

వసంత:—ఇఁక నేఁబోవలయును. ఇప్పటికే ప్రొద్దుపోయినది.

కమ:—మంచిది. కాని నీబాసమాత్రము తప్పకుము. తప్పినయెడల నిహపరముల నీకుఁ గలుగుపర్యవసానములను మఱువకుము.

"ఏలతప్పుదును? నాకు వెఱ్ఱియాయేమి?" అని వసంత నమ్మకముగాఁ బలికి, యాపట్టికుండ నెత్తి నెత్తిపైఁ బెట్టుకొని, యాసత్రమునుండిఁ జీఁకటిలోఁబడి కంటికి మఱుఁగైపోయెను.

---

# ఇరువదియవతరంగము.

---

## ఇంతకు వారియదృష్టము మంచిది

వసంత యట్లు కొంతదూరము పోయెనో లేదో, యామె మానసాంబుధియందు వివిధములగు యోజనాతరంగములు ఘూర్ణిల్లసాగెను. ఆకోమలి కెతికర్తవ్యతాపరిజ్ఞాన మించుక యుదయించెను. ధర్మశాలయం దెప్పుడు మాళవస్వామిని, మఱి నలువురు బ్రాహ్మణులను జంపుటకుఁ బ్రయత్నములు జరుగుచున్నవి. వసంతయందలి సౌజన్యగుణమంతయు నీఘాతుకకృత్యము నెడఁ దిరుగుబా టొనరించుచుండెను. ఆరాజీవగంధికి రాజకీయవ్యవహారములతో నేమాత్రము పరిచయము లేదు. సంబంధమును లేదు. కాని యీవిషయము నా గొల్లపడుచు రాజకీయవ్యవహారమని భావింపలేదు. 'అకటా! అయిదుగురు మానవులను దుర్భరములగు వధలఁ బెట్టుచున్నారుగదా' అనిమాత్ర మామె తలంచెను. ఆఘోరకార్య మాయబలమనసుకుఁ దట్టుకొలఁది, ఆమెకు ముచ్చెమటలు పోయసాగెను. ఆముగుదమేను జలదరించెను. ఆహా! అచట నైదుగురుమానవులు మృత్యువదనముఁ జిక్కుస్థితిలోనుండ, నిచట వసంత వారిసంగతి నించుకయైనఁ దలపెట్టక యింటికేఁ దిరిగిపోవుచున్నదిగదా! ఈచెయిదమున కామెకు సిగ్గుకలిగెను. కమలాక్షునియిష్టానుసారము తానాతనికి మాటయిచ్చినందుల కామానవతి పశ్చాత్తాపమొందసాగెను. కోపశోకము లామెయెడఁ జిందులుద్రొక్కుచుండెను. ఆమె పటపటమని పండ్లుగొఱికెను. పెదవులఁగఱచెను. కాని యాకార్యములన్నియు నిష్ఫలములని యామె యంతలో గ్రహించెను. ఇప్పుడు కర్తవ్యమేమి? క్రూరాత్ములగు నాకుట్రచేయువారికోఱలఁబడి మడియచుండు నామందభాగ్యులఁ గాపాడుట కేదియేని చక్కని యుపా

యము కావలసియున్నది. హత్యారహస్యమును గాంచునట్లు వసంత కమలాక్షునకు బాసచేసియున్నది. ఆబాసను భంగమొనరించుట కామె కేమాత్రమిష్టములేకుండెను. ఆమె ప్రతిజ్ఞాపాలనేచ్ఛ యజేయమైయుండెను. వాగ్దానభంగమువలనఁ జెఱుపైనను బహులు మంచికలుగుననుట నిస్సందేహము. అనాథులగు నైనుగురప్రాణుల సంరక్షించునిమిత్తము తనవాగ్దానభంగమునఁగలుగు పాపము ననుభవించుటకు వసంత సంసిద్ధమతియైయుండెను. కాని విధిలేకుండినఁ దప్ప, మాటతిరుగుట కామానవతి సమ్మతింపకుండెను. అంత యవసర మిపుడున్నదని యామెతలంపలేదు. ఆమె దీర్ఘాలోచనానిమగ్నయై యుండెను. ఆమె యట్లే యొకరావిచెట్టుక్రింద నిలిచియుండెను. ఒక్కసారిగా నామె ముఖారవిందము వికాసభాసురమయ్యెను. ఒకభావనావిద్యుద్దామ యామెమానసాకాశమునఁ దళుక్కుమని మెఱసెను. "ఆహా! ఇపుడు తెలిసెను. ఇదియే నాకు మహాబోధివృక్షము" అని యామెచిన్నది యుత్సాహమునఁ బలికెను. తోడనే యామె గబగబ ధర్మశాల కభిముఖియై నడువసాగెను. ఆమె యెద్దానినో త్వరలోఁ గావింపనున్నదనియు, నా కార్యాచరణమున కామె కృతనిశ్చయురాలై యున్నదనియు నామెవైఖరి చూపఱకు విదితమొనరించుచుండెను. అంతలో వసంత వంటయింటి వాకిటికడకుఁబోయెను. అప్పటికిఁ గమలాక్షుఁడు పాలుకాచియుండెను. ఇఁక నాతఁడావిషపునీటిగంగాళమును లోగిటిలోనికిఁ గొనిపోయి, యచట విస్తళ్లముందుఁ గూర్చుండియుండు నతిథులపంచపాత్రలయం దాజలమును బోయవలయును.

అప్పుడు కమలాక్షునకుఁ దీఱికలేకుండెను. అతఁ డప్పుడు వసంతను గాంచి మండిపడెను. కాని యంతలో నాతఁడు కోపమణఁచుకొని "మరల నెందుకువచ్చితివి?" అని తిన్నగా నడిగెను.

వసంత:—గొంతెండిపోవుచున్నది. కొంచెము మంచినీరు కావలయును.

"ఓహో! అంతయేనా? ఇప్పుడే యిచ్చెదను." అని కమలాక్షుఁడు మందహాసమొనరించుచు నొకపంచపాత్రఁ దీసికొని వంటయింట నొకమూల నుండు మంచినీటికుండకడకుఁబోయెను. కమలాక్షుఁడు ముందుకువంగి యా కుండలోనినీటిని పంచపాత్రలోనికి వంచుచుండుట నామె గాంచెను. ఒక్క క్షణమైన నామె జాగుసేయలేదు. ఒక్కయడుగైన వెనుకనిడలేదు. ఆయు బలముఁ దెగువకలిగెను. ఒక్కగంతులో నామె యావిషపునీటిగంగాళమును బైటికెత్తుకొనిపోయి యానీరు క్రిందఁగ్రుమ్మరించెను. ప్రాయంట కింతయైనది కాని, యింతయు నొకఱెప్పపాటులో జరిగెను. కమలాక్షున కంతయు నెఱుకపడెను. ఆగ్రహపడుచు తనముందుఁజూపిన తెగువకు, నిర్ధారణమునకుఁ గమలాక్షుఁ డొక్కింతతడవు చేష్టలుదక్కి కొయ్యబొమ్మవలె నట్లే నిలువఁ బడెను. ఇంతకాలముగా నాతఁ డామె సాధ్వియనియు, నబలయనియుఁ దలంచియుండెనుగాని, యామె కట్టిసాహసకార్యాచరణమునకుఁ జాలినశక్తి కలదని యాతఁడు కలనైనఁ దలంచియుండినవాఁడుకాఁడు. అంతలో నాతఁడు ప్రజ్ఞవడసెను. జరిగినపనినంతయు నాతఁడు బాగుగా గ్రహించెను. ఇఁక హూణరాక్షసులు తన్నెట్టి యిడుములఁబెట్టుదురోకదా! ఆరావలసిన ౧౮౦ బంగారునాణెము లట్లే చిక్కినట్లు చిక్కి జాఱిపోయినవిగదా! చేతఁ జిక్కిన ౨౦ కాసులైనఁ దనకుఁ దక్కునను నమ్మక మిఁక నేమున్నది. ఇట్టి యూహ లాతనిమానసవీథి నించెను. ఆతని కపరిమితమగుకోపము కలిగెను. ఆతనియొడ లాతనికిఁ దెలియలేదు. "ఓసీ దుర్మార్గురాలా! ఎంతపనిఁ జేసితివే? ఎంతపనిఁ జేసితివే? హూణు లిందులకు నీమానముఁ బోకార్చికాని వదలరు. నీప్రాణములఁ దీసికాని యూరకొనరు." అని యాతఁ డఱచెను.

కమలాక్షునియఱపులు లోగిలిలోనియతిథులకు వినఁబడియెను. సంగతి నెఱుంగుటకై వారందఱు పిలపిల వంటయింటికడకుఁ బరుగిడిరి. అప్పుడే యశో ధర్మ నోట ముద్దఁబెట్టుకోఁబోవుచుండెను. కమలాక్షునినోటనుండి 'హూణులు' అనుపదమును వినుటయే తడవుగా నాతఁ డొఱనుండి కరవాలము నూడఁ

బెజికి, యచటికిఁ బరువెత్తెను. అతఁడు మున్ముందే యాధేయుని వాసుదేవు నకారణము సంశయించియుండెను. ఒక్క గంతులో నాతఁడు వాసుదేవు నరి కట్టెను. హఠాత్సంభవమైన నీవిషమపరిస్థితుల నెదుర్కొనుటకు వాసుదేవుఁడు సంసిద్ధుఁడైయుండినవాఁడుకాఁడు. యశోధర్మ వాని రెండుచేతుల నశ్వము తోఁ గట్టికట్టి, వానిఁ దన వెంట వంటయింటికి నడిపించుకొనిపోయెను.

అప్పు డచటిదృశ్యము మఱచినను మఱపురాకుండెను. కోపావేశమున నోటికొలఁది నఱచినకమలాక్షుఁ డిపుడు తనభీషణారావములకు ఫలితముగఁ దనకేమి కీడుమూఁడునో యని గడగడలాడుచు నిలిచియుండెను. ఆసమాచార మును గప్పిపెట్టుటకు నామందమతి యెంతయుఁ బ్రయత్నించుచుండెను. ఇఁక నచట వసంత; ఆమెముఖచంద్రబింబ మానందచంద్రికల వెదఁజల్లుచుండెను. ఆమెనేత్రములం మిడుఁగురుల గురియుచుండెను. తనవిధిని నెఱవేర్చితి నను ముదముచే మోమున గౌరవగాంభీర్యములు తొలుకాడుచున్నను, తన కార్యము నొరులకు వినిపించి ప్రశస్తిఁబడయనొల్లని కర్మయోగివిధమున, వసంత యొకయెడ తొణఁకక నిలిచియుండెను. ఆమందకాంతులలో వాత వ్యాధి, శుక్రాచార్యుఁడు, కుణపదంతుఁడు, ఉదరానందుఁడు, అజ్ఞానాంధ కారుఁడు, సుబంధువు నిలిచి, కమలాక్షుని వసంతునిఁ గాంచుచుండిరి. వాగ్వా దమునకుఁ గారణమును వారు గ్రహింపలేకుండిరి.

బంధితుని వాసుదేవునిఁ గొనివచ్చినయశోధర్మను గాంచి వారందఱు వెఱఁగందిరి. కాని కమలాక్షునకుమాత్ర మపరిమితమగుభయ మంకురించెను. బంధితుని వాసుదేవుని, యశోధర్మచేతియందుఁ గాలాహిపలెనుండు విచ్చు కత్తినిఁ జూచి, కమలాక్షుఁ డాపాదమస్తకము గడగడవడఁక మొదలిడెను. కాని యశోధర్మమాత్ర మూరకుండలేదు. అట్లాతఁడు చక్కగాఁ గమలా క్షుని డాసి యావణకుఁడుపురుఁగుపై ఖడ్గము జళిపించుచుఁ గఠినస్వరమున "ఓరీ! నిజమాడుము. నిజమంతయుఁ జెప్పుము. ఒక్కముక్కయైన దాఁచఁ గూఁడదు. లేకున్న నీప్రాణములు నీవి కావని తలంపుము" అని గద్దించెను.

నరకకథాసంశ్రవణముచే నచటివారందఱు నిర్విణ్ణులైరి. ఆవంటవాని కాలు సేతులఁ గట్టివేయునట్లు యశోధర్మ యాజ్ఞాపించెను. కమలాక్షుని పాడు పన్నుగడల విని రౌద్రమూర్తులై యుండినవాతవ్యాధి, శుక్రాచార్యుఁడు, కుణపదంతుఁడు, ఉదరానందుఁడు, తోడనే వానిని గట్టివైచిరి. ఇంతలో వారికిఁ బ్రక్కనుండు పెరటినుండి కుక్కయఱుపు వినవచ్చెను. వెంటనే వాతవ్యాధి యచటికిఁ బరువెత్తెను. "ఇచట నొకకుక్క వచ్చుఁబోవుప్రాణములతోఁ దన్నుకులాడుచున్నది." అని యాతం డఱచెను. వసంతకూడ నచటికిఁబోయి దానిఁ జూచి "అయ్యో! పాపము. దీనికి మిక్కుటముగ దాహమయ్యెఁగాఁబోలు! నేను గ్రుమ్మరించిన యావిషపునీటి నిది గ్రోలియుండును" అని యనెను. యశోధర్మ దీపముతీసికొని యచటికిఁబోయి, నీళ్లమడుఁగులోఁబడి గిజగిజఁ గొట్టుకొనుకుక్కం గాంచి "వసంతా! నీవు పాఱఁబోసిన విషజల మిదియేనా?" అని యామె నడిగెను.

వసంత:—అవును.

యశో:—ఈసంగతిని నీవు మాకేల చెప్పలేదు?

వసంత:—తనకుట్రల వెలువరించకుండునట్లు, కమలాక్షుఁడు నాచేఁ బవిత్రప్రమాణములఁ జేయించుకొనినాఁడు. సప్తగంగలు, త్రిమూర్తులు, సర్వేశ్వరుఁడు వీరియెదుటఁ జేసినప్రమాణపవిత్రత మీఱఁజాలని దేకదా!

యశో:—అవును. నాకుఁ దెలియును. కాని మమ్ములఁ గాఁచుటకై నీప్రాణములఁ బణములుగా నొడ్డితివి. మాపై నీకంత యనురాగాభిమానములకు హేతువేమి?

వసంత:—జీవకారుణ్యమే యిందులకుఁ గారణము. నేను నీచురాలనగు గొల్లపడుచుఁగానని చెప్పను. కాని నాయందుఁగూడఁ గులీనులకువలె భూతదయాపశ్చాత్తాపములు లేకపోలేదు.

యశో:—నిజము. నిజము. అజ్ఞానాంధకారుఁ డేఁడీ? ఆతం డేమి చేయుచున్నాఁడు?

ఆత్రిదండి యూసురులఁబాయుచుక్రిం జూచుచు నిలిచియుండెను. అది కొంతసే పట్లు తన్నుకులాడి, అట్టె నిలువఁబడి వారలఁజూచి కన్నులు మూసెను. అంతలో దాని ప్రాణవాయువు లెగిరిపోయెను. అజ్ఞానాంధకారుఁడంతయుఁ గాంచి యొకనిట్టూర్పువిడిచి "ఆహా! ఈప్రాణి యెంతలోఁ బరలోకమునకుఁబోయెను. దీనిమర్మ మేమియోకదా?" అనెను.

వాత:—కమలాక్షుని పాడుపన్నగడలన్నియు ఫలోన్ముఖములై యుండిన, మననిష్క్రమణముకూడ నింత యాకస్మికముగ నింత యగోచరముగ నై యుండెడిది.

శుక్రా:—అందుకు సందేహములేదు. మనము వసంతఋణము నెట్లు తీర్చుకోఁగలము. ఆమె యుపకార మపారము.

శుక్రాచార్యుం డనినఁ గుణపదంతునకు లోలోన గిట్టదు. "నీవు జ్యోతిష్కుఁడవనియే కాని, యీపాడుకుట్రను సూచింపఁజాలకపోతివికదా" అని యాతని నెత్తిపొడుపుమాట లనెను.

శుక్రా:—మిత్రమా! కుణపదంతా! ఈవిషయమై నన్నుఁ బ్రశ్నించినవారెవరి? లగ్నస్ఫుట మొనరించితినా? గోచారముచూచితినా? ఇందులకు నాకుఁ దీరుఁబడియేదీ? తారాబలము, చంద్రబలమును జూడకయే దేనినిఁగాని చెప్పుటెట్లు? మానవునకుఁ గన్ను లున్నంతమాత్రమునఁ జాలునను కొంటివా? ఎదుటనుండువస్తువును వర్ణింప సమకట్టుటకుముందు, వానిఁ జూడఁ బ్రయత్నింపవలయును. ఈవిషయమును నామనోనేత్రముల నెప్పుడో చూచితిని. మనల నీయాపదుదధి గట్టెక్కించినది. వసంతబుద్ధికుశలతలుగాని, నీ మంత్రమహిమలుగావు.

కుణ:—మిత్రమా! శుక్రాచార్యా! నీవాదమునకు వ్యతిరేకముగ నీవే యనుచున్నావు. క్రూరాత్ములగు నీతుంటరులయెడ నామంత్రమును బ్రయోగింప నన్నడిగినవారెవరు? ప్రయోగింపకయే, నామంత్రమును బరీక్షించు

టెట్లు? రానున్నయిడుమను నీ వెఱింగియుంటివికదా? అట్టియెడ దానివిఱుప్ర నకుఁ దగిన వెఱువృచు నన్నడుగుట నీవిధియై యున్నదిగదా!

అందులకు శుక్రాచార్యుఁడు "ఈవిపత్తును నేను గ్రహించియుం డుట నిజమేకాని; దానినుండి తప్పించుకొనుటకుఁ దగినవిధు లానరింప నిన్న డిగియుండెడివాఁడఁగాను. నీవు మాంత్రికుఁడవైనంతమాత్రమున నేమిఫలము? ఈదయ్యములకడ నీమాటలు సాగుననుకొంటివా?" అని వాసుదేవకమ లాక్షులఁ జూచుచు ననెను.

ఆమాటలకుఁ గమలాక్షు, వాసుదేవ, కుణపదంతులుతప్ప నందఱు నవ్విరి. కుణపదంతునకుఁ దలఁగొట్టినటులయ్యెను. పరాభవానలమున నాతని ముఖము జేవురించెను. "ఏమీ! నావిద్య యనిన నీకంత చులకనగానున్నదా? ఎన్నటికైన నావిద్యయే మిన్నకాని, నీది కాదు. పొట్టపగులనట్లు పప్పన్నము మెక్కి, ముక్కుచెవులులేనికథలఁ జెప్పుచుండుమనిన, జెప్పుచుందువు. ఇంతకన్న నీచేత నేమియుఁగాదు. ఇఁక నాసంగతియా? నాది వేఱువిష యము. నేను జీవములను లెక్కసేయలేదు. దారియనక డొంకయనక, పోరాని ప్రదేశములకుఁగూడఁ బోవలయును. ఓషధులను, జెట్లను దేవలయును. అపస్మారకులయెదుటికిని, పిశాచగ్రస్తుల ముంగలకునుబోయి, నోరుతిరుగని మంత్రముల నుచ్చరింపవలయును. ఇంతయేల? నాయవస్థ లాపరమాత్మునకే యెఱుక. కొన్నివేళల నారోగులు నామైఁగూడఁ బడుచుందురు. ఒకమాఱు దయ్యమెత్తినస్త్రీ యొకతె నామైఁబడి నన్నుఁ బీఁకి పాకనుచేసిపెట్టినది... ఔనౌను. నామాటలు నీకు నవ్వుగా నున్నవిలెమ్ము. కావలయునన్న, గాయపు మచ్చఁగూడఁ జూచి, నామాటలయందలి నిజమును గమనించుము. నీవలె నేను బొల్లిమాటలవాఁడఁగానుసుమా! మఱియొకయనుభవము నాలకింపుము. ఒకకన్యకు దయ్యముపట్టియుండెను. నాపిశాచోచ్చాటనమంత్రము లామెయెడఁ బనిసేయసాగెను. మెల్లమెల్లగా నామె మనలోకమునకు వచ్చుచుండెను. అంతలో నామెభర్త—అతనికి దయ్యములనిన నమ్మకములేదు—నాకు బడితె

పూజచేసి చింపిచేట, చీపురుఁగట్టలతోఁ జావఁగొట్టినాఁడు. సహించుకొనుటకేసి నాకు వ్యవధిలేకపోయెను. కాని నీవ్యాపారమునం దిట్టియవస్థ లెక్కడిది? ఇన్నియవస్థలుండినను, ఇట్టిదివ్యవిద్యను విడువ నాకు బుద్ధిపుట్టకున్నది. నావిద్యయందుఁ బరిశ్రమచేసినమానవుల కదృశ్యసంచారము మిగుల సులభముకదా!

వాత:—అయిన మిత్రమా! కుణపదంతా! నీవిప్పు డదృశ్యుఁడవై, నీమాటలందలి నిక్కువమును నిరూపింపుము. అతిమానుషములగు నిట్టికార్యములను వాక్యరూపమునఁ జూపినవారి నెందఱినో చూచితినిగాని, కార్యరూపమునఁ గావించినవారినిమాత్రము చూడలేదు.

కుణ:—మిత్రమా! వాతవ్యాధీ! ఈకార్యము మాటలతో నున్నదనుకొంటివా? దీనివిషయమై నీకించుకేని తెలిసినట్లులేదు. అపరూపములు కష్టసాధ్యములు నగు నెన్నియోసాధనము లిందుల కావశ్యకములై యున్నవి. అద్భుతకార్యము లొనరించుట కద్భుతములగుపరికరములు కావలయును. మానవుఁ డగోచరుఁడగుట సామాన్య మనుకొంటివా?

వాత:—కాని నీవద్దాని నెన్నఁడైనఁ జేసిచూపఁగలవా? ఏండ్లకొలఁదియైన నిన్ను వెంబడించి, యాకార్యమునకు నీకు వలయుపరికరముల సేకరించుటకు నాకభ్యంతరములేదు.

కుణపదంతునిమానము పోవుచుండెను. "మిత్రమా! వాతవ్యాధీ! ఇంతకు నామాటలు నీకర్థమైనట్లులేదు. మంత్రమునకు మానవు నగోచరమొనరించుశక్తి కలదని చెప్పితిని. నేనగోచరుఁడ నగుశక్తి నాకుఁగలదని చెప్పినట్లు జ్ఞప్తిలేదు." అని యాతఁ డనెను.

వాత:—ఓహో! కాని, నీవృత్తియందుండువాని కెవ్వనికేని నిట్లు మాయమగుశక్తియుండుటను నీవు చూచియున్నావా? చూచియుండిన, నేను నీవెంటవచ్చి యాచిత్రమును జూడవలయునని యున్నాను.

కుణ:—మిత్రమా! వాతవ్యాధీ! నాకంతజ్ఞాపకము లేదు. నిజమూడ వలయుననిన, నగోచరమగుసామర్థ్యము చాణక్యునికిఁదప్ప మఱెవ్వరికి లేదని నాయభిప్రాయము.

యశో:—చాణక్యుఁ డంతశక్తివంతుఁడయ్యెను, పగరయెదుటఁబడి సంకటమొందుచుండెను. ఇఁక నేటికీవృథాప్రసంగముచాలును. ఇప్పు డీ క్రూరుల నేమిచేయుదము?

వాత:—చంపివేయుఁడు. ఈనీచాత్ములు మనలను రహస్యముగాఁ జంపివేయ సమకట్టిరి. వారికిఁ దగినశిక్ష, వారిని మృత్యువువాతవేయుటఁదప్ప వేఱొకటిలేదు. ఆవిషజలము వారికే త్రాఁగనియ్యవలయును. నాయుపదేశము కౌటిల్యుని యర్థశాస్త్రసిద్ధాంతముతో సరిపోవుచున్నది. ఆవిషజల మిప్పుడు లేవుగాన, వారిప్రాణములఁ దీయనగును.

శుక్రా:—అవును. వారిప్రాణములదీయుఁడు. నాయభిమతముకూడ నయ్యదియే. వీరి నిపుడు ప్రాణములతో వదలినయెడల, నీసంగతులు లోకమంతయుఁ జాటి మనలను చాణక్యకోపానలజ్వాలల కాహుతిఁగావించికాని వదలరు.

కుణ:—అవును. వారిఁ జంపివేయుఁడు. నాకోరికకూడ నదియే. వారు చచ్చినచో, మనకిఁక విషమిడువా రెవ్వరుండరు. వారు సప్రాణులై యుండినయెడల, నాకు వారనిన సింహస్వప్నముగా నుండును. వారు ప్రాణములుబాసి ప్రేతలైనయెడల నామంత్రమహిమచే వారిని క్షణములో స్వాధీనమొనరించుకొందును.

ఉద:—వారింజంపుటయే మంచిది. నాయభిప్రాయముగూడ నదియే. మనము త్రాగనుండుపదార్థములో విసమిడుటకు వారు ప్రయత్నించిరి. ఆవిషమును వారు నేతిలోఁగలిపియుండినయెడల వారి పాపముక్రూరతరమైయుండెడిది. కాని యిప్పుడుకూడ నీ కార్యము క్రూరతరమనుటకు సందియములేదు. మానవ

జీవితమునకు ముఖ్యమగు నాహారమును, దాని పావనత్వమును సంరక్షించుటకు మీ కిష్టముండినయెడల, వీరినిరువురను మట్టు పెట్టుట సర్వోత్తమము.

అజ్ఞా:—వీరిని వదలివేయుఁడు. ఉపకార మపకారమునకు బుద్ధి చెప్పును. సత్య మసత్యమును బూడిదఁగావించును. ఇయ్యది ప్రకృతికి స్వతస్సిద్ధమగు నాచారము. ఇది కాకిదంతయుఁ బ్రతిహింస యనఁ జెల్లును. ఈరీతిగాఁ బడసినజయలక్ష్మి యాచంద్రార్కము వెలసియుండును. ఇట్లు కాని జయము బుద్బుదప్రాయము. బూటకము. అపకారమున కపకారము బుద్ధిహీనునకు స్వభావము. ఇప్పుడు నాయభిప్రాయము నడిగినయెడల వీరి నిరువురను బంధవిముక్తులఁ జేయుమని యందును. వీరిని కఠినశిక్షలఁ బెట్టుటకుబదులు, ఉదారబుద్ధితో మన్నించుటవలన దేశమంతయు సద్భావసంశోభితము కాఁగలదు. వీరిని వధించినచో నేకొందఱో మీయధికారపరాక్రమములకు వణఁకుచుందురు కాని వీరిని బంధవిమోచనులను గావించినయెడల, సహృదయ వారిజములు వికసించునుగదా!

సుబంధువు:—అవును. వీరిని విడిచివేయుఁడు. ఇదియే నాయభిప్రాయము. ఒకప్పుడు వాసుదేవుఁడు కులీనుఁడై యుండెను. ఆరాజవంశము శౌర్యసంపన్నమై, వైరిరాజపన్నగములకు వైనతేయమైయుండెను. కాని యాగుణము లాతనియెడ దోషములై పోయినవి. ఆతనిచేతనుండు నమృతపుగుండ విషపుఁబోడిగా మాఱినది. హూణభయ మొకవంకను, అధికారైశ్వర్యమదము లొకవంకను జేరి పీడింప నాతఁ డీనీచకార్యమున కొడిఁగట్టినాఁడు. కులీనుఁడగు నాతఁ డిట్లు భ్రష్టుఁడైనందులకు జాలిపడవలయును. కాని మన మాతనిపైఁ బగఁదీర్చుకొనఁ నెంచి, యాతనిఁదుదముట్టింపరాదు. వాసుదేవుఁడు నమ్మిన బంటు. ఉపకృతికిమా ఱుపకృతి నొనరించుస్వభావముగలవాఁడు. అదియటుండ నిట్టియెడ నీతనిమన్నించి యీాతని మీరు లోఁబఱచుకొనినయెడల నొకపోటరిహూణులవిడిచి మిమ్ముఁ జేరఁగలఁడు. ఇఁకఁ గమలాత్ముఁడా! ఆతఁడు వంటవాఁడు. సామాన్యుఁడగునట్టిమానవునికడ మాన్యవర్తన మెట్లుం

డును? హూణభీతిచేతను, పసిడిపై విభ్రమచేతను నాతఁ డీనీచకృత్యమునకుఁ బాల్పడియెను. మీశత్రుశ్రేణియం దిట్టిపందలకుఁ జోటులేదు. కాన నాతనిఁ గఠినముగ మందలించి, బంధవిముక్తుఁ జేయుట సమంజసము.

వారిమాటలన్నింటిని యశోధర్మ యాలకించుచుండెను. ఆతఁడు వసంతతో "వసంతా! నీయభిప్రాయమేమి?" అని యడిగెను.

వసంతను లజ్జకలిగెను. "దేవా! నేను బీదరాలను. గొల్లదానను. కన్యను. అట్టియెడ మీరిపుడు చిత్తగించిన సముచితాభిప్రాయములకు నాయభిప్రాయమునకు హస్తిమశకాంతరము గలదు." అని యామె చెప్పెను.

యశో:—ఉండవచ్చుఁగాక! ఏపుట్టలో నేపామున్నదో యెవరి కెఱుక? ఏచిక్కునువిడఁదీయుట కేవ్యక్తికడ బుద్ధికుశలతలున్నవో యెవరికిఁ దెలియును. కాన నీయభిప్రాయమును నేను వినవలయును.

వసంత:—దేవా! మీరు నాయభిప్రాయమును వినవలయుననుచున్నారు గాన విన్నవించుకొందును. దానికి విలువయుండుఁగాక; ఉండకపోవుఁగాక. వీరిపుడు రెండుమార్గములఁ జూపియున్నారు. కాని యొక్కటియైన నాకు సరిపడలేదు. వారినిరువురవధించుట న్యాయసమ్మతమై యుండవచ్చును. కాని నేఁటిరాజకీయపరిస్థితులయం దదియుక్తముగాదు. నీతియుఁగాదు. ఆకార్యము హూణక్రోధాగ్ని కింధనప్రాయమై, యాజ్వాలలను మనపైకిఁ ద్రిప్పును. లోకులు కాకిమూఁకలు. మీరు తలకుమీఱి శిక్షించితిరనియు, కఠినకర్ములనియు వారు మిమ్ము నిందింపకపోరు. రాజకార్యసంసిద్ధికిఁ గొన్ని యెడల విషప్రయోగముసైతము నీతిబాహ్యముకాదని యెల్లరకు విదితమేకదా! ఆయభిప్రాయము ప్రమాదజనితము. కాని యది యాచరణలోనున్నది. 'పదుగురాడుమాట పాడియై ధరఁజెల్లు' ననుట లోకప్రసిద్ధముగదా! పతికి విసమిడినసతిని దండించునంతకఠినముగా నిపుడు వీరలదండించుట ధర్మవిహితముగాదు! అట్లని పావనులగు నీయతీశ్వరుల యభిప్రాయమునందు నే నేకీభవింపఁజాలను. వారియభిప్రాయము లెంతయు సత్యము. కాని రాజకీయ

ప్రపంచమునందలి యిముడవనియు. నాచరణయోగ్యములు కావనియు నా యభిప్రాయము. పలుగాకియై మానవుం డొనరించునపకారములను మదినిడు కొనక, అందులకుమా జాతిని నుపకృతులచే మెప్పించుచు నాతనితప్పిదము నాతనికే యెఱింగించి యాతనివక్రగతిఁ జక్కఁజేయఁ బ్రయత్నించు చుండిన, నెన్నటికేని యాతనికి మాన్యవర్తన మలవడకపోదని యీయతీశ్వ రుల నమ్మకము. సాంఘికజీవితమున కీసూత్రము చాలవఱ కన్వయించును. కాని విపరీతముగ నర్థమొనరించుకొనుమానవులు బెక్కురున్నారు. తప్పు నకుమా ఱొప్పొనరించిన 'పందులుకాన నట్లొనరించిరి' అని హేళనఁజేయు పలువలు సామాన్యముగ నుందురు. కాని నేనసినట్లు, సాంఘికజీవితమునం దీసిద్ధాంతము చెల్లినఁజెల్లునుగాని రాజకీయములమాత్ర ముపయోగించదు. రాజకీయపరిస్థితులకు నిలుకడలేదు. అవి క్షణక్షణము మార్పొందుచుండును. ప్రజ్ఞాప్రయోగముచే జనులయందలి విరసభావమును నిదానముగాఁ దుడిచి వేయుటకుఁ గావలసినవిళంబము రాజకీయపరిస్థితులయం దుండదు. కాని మునీంద్రునకు మోటుమానిసికిఁ గలుగుపోరాటమునం దిట్టిసిద్ధాంతరాజముల నొఱసిచూచి వానివిలువ నెఱుంగవచ్చును. అందుచేఁ బరస్పరవిరుద్ధములగు నభిప్రాయములకు మధ్యస్థముగా నొకమార్గము వెదకి దాని ననుసరించుట శ్రేయము. విషయవిస్తరమేల? వారివధించుటకుఁగాని, విడిపించుటకుఁగాని నాకు సమ్మతములేదు. అవసరమని తోఁచినంతకాలము, వారిని మీఖైదీలగా నుంచుకొని యనంతరము నియమసహితముగనైన, రహితముగనైన విడువ నగును.

ఆమాటలకు యశోధర్మ సంతసించి "వసంతా! బాగుగాఁ జెప్పితివి" అని యామెఁ గొండాడి యీకుట్ర చేసినవారల నిద్దఱిఁ గాంచి "మీరేమైనఁ జెప్పుకోదలంచితిరా?" అని ప్రశ్నించెను.

వాసు:—నామాటవినుము. నేనుయశోధేయుఁడను. నామాతృభూమి యభిమానమునకుఁ బెట్టిన పేరు. సార్వభౌమేంద్రుఁడుసముద్రగుప్తుఁడుకూడ

మాప్రసక్తిమాని, మాకు స్వాతంత్ర్యమొసఁగియుండెను. కాని మామంచి దినము లంతతో నంతరించెను. వానిని నేను మరలఁ బడయనెంచి యీ హూణుల నాశ్రయించితిని. పగవానికి విషప్రయోగ మొనరించుట ధర్మబద్ధ మగు రాజకీయసిద్ధాంతమని నానమ్మకము. దానంజేసియే యీకార్య మొనరించితిని. చేయరానికార్యమును నేను జేయలేదు. కాని నీవిప్పుడే నన్ను బంధవిముక్తుఁ గావింపుము. లేకున్న హూణక్రోధాగ్నికీలలు నీపైకిఁ దిరుగును. ఆకీలలవేడిమి నీకుఁ దెలిసియేయున్నదిగదా? నన్నుఁ జంపుటగాని, ఖైదిగానుంచుటగాని, నీకు క్షేమముగాదు. ఇష్టములేకున్నను, నన్ను విడువక నీకు గత్యంతరములేదు. నామాట జరుపకుండినచో, నీతలప్రయ్యలగుట కెంతయో కాలముపట్టదు.

కమ:—నేను రెండుమూఁడుమాటలు విన్నవించుకొందును. దేవర వారు గొప్పవారు. పరాక్రమవంతులరు. ఉదారవంతులరు. ధీవిశారదులరు. కరుణానిధులరు. సద్గుణసంశోభితులరగు మీరు వీనిఁ జంపుటకైనను, ఖైదీగాఁ గొనుటకైనను గలనైనఁ దలంపరు. నన్ను మీరు విడిచిపుత్తురని నానమ్మకము. చోళరాజ్యమునకేని, పాండ్యభూమికేని నేను వలసపోయెదను. తిరిగి రానని ప్రమాణ మొనరింతును. నావెంట వసంతకూడ రానున్నది.

వసంత యందులకుఁ గోపగించుకొని "ఓహంతకుఁడా! నేనురాను" అని కఠినముగాఁ బలికెను.

"అయిన నొంటరిగాఁబోయెదను. ఏకాకినై వలసపోవుటకుఁగూడ నేను సంతసింతును. నేను దరిద్రుఁడను. వంటచేసి బ్రదుకువాఁడను. నీచాతినీచుఁడను. దేవరవారిదర్శనము చేసికొనుటకైన నాకర్హతలేదు. ఓదేవా! నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుము." అని కమలాక్షుఁ డాతనిపాదములఁ బట్టుకొని "నేను బ్రాహ్మణుఁడను. మీరు క్షత్రియులరు. నన్ను రక్షించుట మీపనికాని, చంపుటగాదు. అయ్యయ్యో! నన్నుఁ జంపకుండునట్లు బాస చేయుఁడు. అంతమాత్రము పుణ్యమునబోండు" అని పెద్దపెట్టున నేడువ

వ్యాధి, కుణపదంతు లావిధమున దలంచుట కేదియో యొక కారణమున్నది. బానియం దించుక యర్థమున్నది. కాని, ఓశుక్రాచార్యా! 'నీవుకూడ వారి పాటకు బల్లవిపాడుచున్నందులకు నాకు మిగుల నాశ్చర్యముగానున్నది.

శుక్రా:—మిత్రమా! ఉదరానందా! నీవలె నాకుఁగూడ 'అన్నము పోయెఁగదా!' అనుకొంటఁకలదు. కాని ప్రాణభీతిమాత్రము నీకంటె నాకు మిక్కుటముగాఁగలదు.

అజ్ఞా:—మిత్రులారా! పోయినప్రాణము తిరిగిరాదని మీకు నిశ్చయముగాఁ దెలియునా?

వాత:—ఓస్వామీ! వచ్చినరావచ్చుఁగాని పూర్వరూపమునరాదు. నేను జచ్చినయెడల, వాతవ్యాధి చచ్చినట్లగును. నన్ను వీడిచనినజీవుఁడుమఱి యొకరూపమున జన్మింపవచ్చును. కాని వాతవ్యాధిగా మరలఁబుట్టనేరఁడు. నావ్యక్తిత్వము వాతవ్యాధి యనుపేరుతోనుండు నాకే చెందియున్నందు వలనఁ, బోయినప్రాణము తిరిగిరాదని చెప్పనగును. ఇంతవిస్తరమేల? ఒక్క మాటలోఁ జెప్పెద. మరణించినవాతవ్యాధి తిరిగిరానేరాఁడు.

ఆతనిపలుకుల కందఱు నవ్విరి.

యశో:—మంచిది. మనభోజనసమస్యను బరిష్కరించుటెట్లు? ఎంత యోదూరమునుండి గుఱ్ఱముపైవచ్చితిని. ఇఁక నెంతయోదూరము పోవలసియున్నది. నాకు మిక్కుటమగు నాఁకలి పుట్టుచున్నది.

ఉద:—దీనిని బరిష్కరించుట కుపాయము?

అజ్ఞా:—దైవమేగతియని నమ్మి, యన్నము తినుఁడు.

సుబం:—ముందొక మెతుకుఁదిని, దాన నేమైనఁ బ్రమాదము కలుగునో చూడనగును.

వసంత:—ఆమెతుకును గమలాక్షునిచేతఁ దినిపింపుఁడు. ఒకయరగంట తాళి, ప్రమాదమేమియు లేకుండిన, మీరుకూడ హాయిగా భుజింపనగును.

"మేలుమేలు" అని యశోధర్మ యనెను. మిగిలినవారందఱు అందులకు సమ్మతించిరి. కమలాక్షు నొక్కొక్క పాత్రమునందలి పదార్థములఁ గొంచెము గొంచెము తినఁజేసిరి. ఆతఁ డాపదార్థములను జంకలెగురవైచుచు మ్రింగెను. ఆతఁడుకూడ నాకుక్కవలె విలవిలఁదన్నుకులాడి చచ్చునేమో యని గమనించుచు వారందఱు నరగంటసేపు వేచియుండిరి. కమలాక్షుఁడు దిట్టముగా నుండెను. ఇఁక నన్నము తినవచ్చునని యశోధర్మ యనెను. వాతవ్యాధియు నాతని స్నేహితు లందుల కియ్యకొనిరి. ఆమేప్రకుచు భోజనమునకుఁ గూర్చుండిరి. ఆఁకలి పెల్లున నకనకలాడువారందఱు మిగులఁ ద్వరగా భుజించిరి. పాత్రలన్నింటిని వారు వట్టివిగాఁ జేసి యుండెడివారే కాని, వసంతకూడ నన్నము తినవలసియుండెను. వాసుదేవున కన్నమిడినచో సత్త్వసంపాదనమునఁ జేసి బంధవిముక్తికై ప్రయత్నములొనరించునని, యశోధర్మ యాతని కేమియుఁ బెట్టలేదు. ఈతలంపువలననే, కమలాక్షుఁడుకూడ నఱకడుపునకుఁ గుడువఁజేసెను. ఆయతీంద్రు లిద్దఱు పాలుత్రాగిరి.

యశో:—ఆపాలయందుఁగూడ విషమున్నదేమో? ముందావంటవాని కొకగుక్కయిండు.

అజ్ఞా:—వలదువలదు. ఈపాలు నిర్విషమని యాతఁడు చెప్పినాఁడదియే చాలును. ఆతఁడు కల్లరియైన నామేలున కని తలంచెద. అప్పుడు నేను జీవనిర్గమనానంతరదశ నొకించుక కాంచఁగలనుగదా! ఆత్మహత్య మాత్రము పరమపాపమని నామతము.

క్షీరపానమున నజ్ఞానాంధకారసుబంధువుల కెట్టిచెఱుపుకలుగలేదు. అందఱును క్షేమముగా నుండిరి.

వసంతకూడ భుజించెను. ఆబంధితులనిరువురను యశోధర్మ, వాసుదేవుని గుఱ్ఱముపై నెక్కించి వారిని దానికి గట్టిగాఁ గట్టివేసెను. ఆసన్న్యాసు లిరువురికడ నాతఁడు సెలవుగొనెను. వా రాతని దీవించిరి. పిదప నాతఁ డాపథికుల నలువురఁ బిలిచి, నాఁటివృత్తాంతములను రహస్యముగా

నుంచునట్లు వారిచే బాసచేయించుకొనెను. ఆతఁడు వసంతను "వసంతా! ఇంకను నీవు నావెంటవచ్చుట కిష్టపడుచున్నావా?" అని ప్రశ్నించెను.

వసంత:—అవును. ఇచట నాకు సౌఖ్యముగానుండదు. ఇఁక నే నే మాత్ర మిచటనిలిచినను, నాజీవితము దుర్భరమైయుండును.

యశో:—అయిన నావెంటరమ్ము.

ఆమెను దనగుఱ్ఱముపైఁ గూర్చుండఁజేసి, యశోధర్మకూడ నెక్కెను. వాసుదేవకమలాక్షు లెక్కియుండు గుఱ్ఱపుఁగళ్లెమునుబట్టుకొని, యశోధర్మ బయలుదేఱెను.

---

# ఇరువదియొకటవతరంగము.

---

## కేరళమునకుఁ బ్రయాణము.

బారుకచ్ఛమునందలి నాఁటిప్రభాతము కన్నులపండువుగానుండెను. ఆకసమంతయు నరుణకాంతిరంజితమై యుండెను. సూర్యసారథియగు నరుణదేవుఁ డనంతమగు తనదారినడువ మొదలిడెను. నాఁడు పున్నమ; ఆస్తికులగు ప్రజలు గుంపులుగట్టి సముద్రస్నాన మొనరించుచుండిరి. 'విక్రమ' నావపైఁ గేరళపుత్రమునకుఁ జను ప్రయాణికులు రేపుచం దొక వైపు సరభసప్రవృత్తినుండిరి. రామచంద్రుఁడు చాల ననుభవశాలి యగునావికుఁడు. అచటఁ గాఁగలకార్యములన్నింటి నాతఁడు మిగుల శ్రద్ధతో విచారించుచుండెను. వివిధచిత్తవృత్తులతో నుండుబాటసారు లందఱు సముద్రయానముకొఱకు కొనరించు సన్నాహములఁ గాంచుచుండిరి. సుమత్రా జావాద్వీపములకుఁ బ్రవాసమేగ నడుకట్టి సౌరాష్ట్రదేశమునుండి సకుటుంబముగా నరుదెంచియుండువారును—వ్యాపారముచేసి లాభములు గొనుతలంపున విదేశములకుఁ బోవునుద్దేశము నుండుబేహారులును—అటువలసపోక, యిటు వ్యాపారముచేయక ప్రాణభీతిచే దూరదేశములందుఁ దలఁదాఁచుకొననుండు నిర్భాగ్యులును—నచటనుండిరి. కాని యాత్మ మనఃస్థితాభిప్రాయములను వెలువఱుప వారిలో నెవ్వనికిఁగాని గుండెలులేవు. నానావేషధారులై పాయసములోని పంచదారవలె నెల్లెడలఁ జరించు గూఢచారులవలనిభయము వారికి మిక్కుటమైయుండెను. చాణక్యుని కాలమునుండి యీవేఁగులనిన జనులకు సింహస్వప్నమయ్యెను. స్వతస్సిద్ధముగా భారతీయుల కలవడియుండిన వతిథిసత్కారాదిసద్గుణము లీభీతిచే నించుకించుక క్షీణింపసాగెను. కాని

యానాఁడానౌకాశ్రయమునందుండు పరాజితులు తమవ్యాకులమనోభావముల నెంతె మఱుఁగుపఱుపఁ బ్రయత్నించుచుండినను, నయ్యవి వారిముఖదర్పణముల నువ్యక్తము లగుచుండెను. కాని వారిలో నొక్కవ్యక్తిమాత్రము నిరామయచిత్తుఁడై యుండెనని యాతనిమోముతీఱు చెప్పకయే చెప్పుచుండెను. అతఁడే మనబాలాదిత్యుఁడు. అతఁడొకయెడఁ బరమార్థితో సంభాషించుచుండెను. అప్పుడు రామచంద్రుఁడు వారల డాసి "ఆర్యా! నావ రేపు బయలుదేఱును. మీమిత్రులాముగ్వు రెక్కడ?" అని బాలాదిత్యునిఁ బ్రశ్నించెను.

బాలా:—ఇంతవఱకు వారిపొలఁకువయేలేదు. కాని వారల ననుక్షణము నిరీక్షించుచున్నాను.

రామ:—నియమితకాలమునకుఁ దర్వాత నొక్కదినమైన నిలువఁ జాలము. ఇప్పుడు సముద్రము ప్రశాంతముగా నున్నది. మనము కేరళమునకుఁ జేరుటకు ముప్పదిదినములైనఁబట్టును.

బాలా:— నేనేమిచేయుదును? వారులేక నేను రాఁజాలను. వారికట్లు మాటయిచ్చితిని. మాటతిరుగుట నాచేతఁగానిపని. అదియటుండ వారలను నిర్దయహృదయుఁడగు హూణులవాతవైచిపోవుటకు నాకిష్టములేదు.

రామచంద్రుఁ డొకించుకసేపు బాలాదిత్యుని నిశితవీక్షణములఁ జూచుచు రహస్యముగా "ఆర్యా! నీవు హూణవిరోధివా? మఱి మీస్నేహితులుగూడఁ దోరమానునిశత్రువులా?" అని యడిగెను.

అందులకుఁ బరమార్థి "మిత్రమా! అట్లడుగుచున్నావేమి? సముద్రయానార్థమై నౌకకువచ్చియుండువారిపై నిట్టిప్రశ్నావళిఁ గురిపింపరాదని నీవెఱుంగవా?" అనెను.

రామ:—కాదుకాదు. అతనిఁ జిన్నపుచ్చవలయునని నాయభిమతము కాదు.

బాలా:—రామచంద్రా! హూణక్రోధానలమునకు నీకు భయమగుచున్నదా?

రామ:—(రోషముతో) నేనా? నాకా? హూణుఁడనిన నాకా భయము. ఓయువకుఁడా! నిర్వక్రపరాక్రమోజ్జ్వలుఁడగు సముద్రుని సంక్షోభములఁ బూరికిఁగొనని నేనా, హూణుఁడనిన వణఁకుట? సంక్షోభసమయముల సముద్రుఁ డొనరించునల్లకల్లోలములకు ముందు మిహిరగులుని రాక్షసకృత్యములు లెక్కకువచ్చునా? పంచభూతములతోడి పోరాటమునందే నాజీవితము గడచిపోవుచున్నది. సర్వశక్తిసమోపేతమగు ప్రకృతికిని, తుచ్ఛమగు పౌరుషమునకు నెంతయో వ్యత్యాసముగలదని నాకుఁ దెలియును. లేదు లేదు. మిహిరగులుండనిన నాకు భయములేదు. నీవు హూణవిరోధివని తోఁచినందున నిట్టిసంప్రశ్న మొనరించితిని.

బాల:—నీకు హూణభయములేదని వినుటకు నేను సంతసించుచున్నాను. కాని నేనుమాత్రము హూణవిరోధియగుట నిజము. అందుచే నామిత్రులకొఱకై నాకించుక యాతురముగా నున్నది.

పర:—ఓహో? ఆవచ్చునాతఁడు దొంగలరాయఁడు హరిరాముఁడు గదా?

హరిరాముని పేరు విన్నంతనే యాప్రజాసమూహమునం దలజడి పుట్టెను. వణిజులందఱు విస్మయభయాక్రాంతచేతస్కులై తమతమసరకులను భద్రపఱచుకోసాగిరి. కాని బాలాదిత్యునివదనాంబుజ మానందప్రఫుల్లమయ్యెను. తనపూర్వస్నేహితునిఁ గలిసికొనుటకుఁ బరమార్థి యువ్విళ్లూరుచుండెను. రామచంద్రుఁడుకూడ నాతురహృదయుండై యుండెను. పరమార్థి సూచించినదిక్కున కందఱవిలోకనములు వ్రాలెను. తమ కభిముఖముగా నలుగురుమానవులు వచ్చుచున్నారని వారు గ్రహించిరి. ఆవచ్చు నాతఁడు దొంగలరాయఁడు హరిరాముఁడే. అందుకు సందియములేదు. రఘుపతి, భద్రబాహువు, సరస్వతి-మువ్వురు నడవిగుఱ్ఱములపై నాతనివెంట వచ్చుచుండిరి. వారు మువ్వురు బడలియున్నట్లగుపడుచుండిరి. కాని సరస్వతి పరిశ్రాంతయై యుండియుఁ ద్రిలోకసమ్మోహనమగురూపసంపదతో నలరారుచుండెను.

సానఁబట్టినను నారత్నము కాంతుల నీనుచుండెను. "ఈయచ్చరమచ్చెకంటి యెవరైయుండును?" అని రామచంద్రుఁ డాలోచించుచుఁ బరధ్యానమున మునిఁగి, హరిరామునిఁగాని, యాతని రాకనుగాని గమనింప మఱచిపోయెను. హరిరాముఁడు బాలాదిత్యుని సమీపించి, "గొంతుపైకివచ్చినకత్తుల నెన్నింటినో తొలఁగించుకొని, కడ కెట్టులో యొకట్టుల నిచటికిఁ జేరఁగలిగితిమి" అని హెచ్చరించుకొనెను. అంతలో నాతఁడు పరమార్థిఁ జూచి, విస్మయమొంది "ఆహా! పరమార్థి, రామచంద్రు లిచటనేయున్నారా?" అనియనెను.

ఈకుశలసంప్రశ్నము పరమార్థిరామచంద్రుల మానసములయందు వివిధభావములకుఁ జోటిచ్చెను. కాని రామచంద్రుఁ డంతలో సమయస్ఫూర్తివహించి "అవును. హరిరామా! నేనిచటనే యున్నాఁడను. ఆహా! మొండొరులఁ జూచి యెంతకాలమాయైనది. అవును. ఈయెనిమిదేండ్లుగా గహనమునందు నీవును, సముద్రమునందు నేనును గాలము గడపుచుంటిమి. ఉజ్జయిని యెట్టిదో నేను బూర్ణముగా మఱచిపోతిని" అని ప్రత్యుత్తరమొసంగెను.

పర:—అందు విస్మయమేమున్నది? ఈముగ్గురుస్నేహితు లెవరో మన మెఱుంగవలయును.

హరి:—ఈతఁడు భద్రబాహువు. ఉజ్జయినీపౌరశేఖరుఁడు. జైనుఁడు. ఈతఁడు రఘుపతి. ఉజ్జయినీపౌరపుంగవుఁడు. ధర్మైకనిరతుఁడు. ఈమె యీతనితనయ. సరస్వతి. ఈమె నాకుమారిత.

పర:—నీకుమారితయా?

హరి:—అవును. ఈమెను నేను పుత్త్రినిగా స్వీకరించినాఁడను. ఈమె యిపుడు నా నారాయణిసుమా?

నారాయణిపేరు విన్నంతనే బాలాదిత్యుఁడు, పరమార్థి, రామచంద్రుఁడు, సరస్వతి, భద్రబాహువు, రఘుపతి, అందఱు దుఃఖించిరి. వారినయ

నములు బాష్పపూరితము లయ్యెను. హరిరాముని యదృశాశ్రుకణములఁగని వారుకూడ గంట నీరుగార్చిరి. దయార్ద్రహృదయులగువారిఁగాంచి, యా దొంగలమిండని శిలాకఠినహృదయముకూడఁ గఱగెను. ఇన్నియేండ్లుగా దన్నుఁ గనికరించినవారల నాతఁడు గాంచియుండలేదు. ఆతనిహృదయము కఱిగి యశ్రుజలరూపమున నాతనికనులనుండి వెల్వడసాగెను. హరిరాముఁడు కుఱ్ఱవానివలె వెక్కి వెక్కి యేడ్చుచుండెను. బాష్పవారి కాలువలుగట్టి ప్రవహించుచుండెను. అందఱకు నాశ్చర్యమయ్యెను. హరిరాముఁడు విలపించుట నింతదనుక నెవ్వరుఁ జూచినవారుకారు. చోరనాయకుఁడగు హరిరాముఁ డంత దుర్బలుఁడనువిషయము వారికిఁ దెలియదు. హరిరామునియాగమనమున వ్యాకులచిత్తులైయుండిన యావణిజులందఱిపు డాతనిడాసి సోదరమానవునియెడఁ జూపుటకుఁ గావలసినప్రేమను బీజారఁగలిగిరి. వారిమాపులు కరుణావహములై యుండెను. సరస్వతి యాదొంగలరాయనిచెంతకుఁబోయి "బాబూ! నీ వీవిధమున నేడువఁగూడదు. నేనిఁకమీఁద నీనారాయణినై యుందునని చెప్పితిఁగదా!" అని యనునయించెను. కాని హరిరాముఁ డింకను బెద్దపెట్టున నేడువ మొదలిడెను. "ఓయమ్మాయీ! ఓతల్లీ! నన్నేడువనిమ్ము! నేను విలపించి చాలకాలమైనది. విలపించువిధముఁగూడ మఱచితిని. నాకన్నిటిబుగ్గ వట్టిపోయినదనుకొంటిని. నీయనురాగంపుఁబెంపున నేను బోఁగొట్టుకొనిననిధిని మరలఁ బడసితిని. ఆహా! సంతోషసంతాపవిహీనమగు మానవజీవితము కాల్పనా!" అని హరిరాముఁడు పలికెను.

భద్ర:—జైనపరమాత్ముఁ డేమిసెలవిచ్చెనో తెలియునా? సంతోషసంతాపములు దుర్బలునిచిహ్నములు. ఆద్వంద్వములను జయించుట కాతఁడు ప్రయత్నింపవలయును. ద్వంద్వాతీతుఁడే ముముక్షువనఁ జెల్లును.

రామ:—జైనభగవానుఁ డేమైనఁ జెప్పియుండవచ్చును. ముద్దుబిడ్డల తొక్కుపలుకులకు మురియనివానిఁగాని, నారాయణిఁబోలినమానవతి దుర్మరణమునకుఁ గంటఁదడిపెట్టనివానిఁగాని, మన మేమని తలంతుము.

పర:—పశువనితలంతుము. సంతోషసంతాపములు లేనిజన్మ మెందు లకు? పవలురేలు లేనిజీవిత మెందులకు?

భద్ర:—మిత్రులారా! సంతోషసంతాపములకు మొద్దువలె నుండు మానవుని నలుగురు నిందింపకపోరని నాకుఁ దెలియును. కాని మానవాతీతుని సంగతి వేఱు. ద్వంద్వములజయించిన మానవోత్తముఁడు మీవ్యాఖ్యానముల కందఁడు. అతనిజోలికి జనులుపోరు. అతని ద్వేషింపఁబూనరు. చిత్తవృత్తుల ననుసరించి ముఖములను శోకప్రమోదరసముల నలఁదుకొని, యితరసమయ ముల స్థాణువులవలె నుండుమానవాధములమాత్రము వారు నిందించుచుందురు. దుర్దశాంబుధి మునుఁగనుండుమానవుని గట్టునకుఁ జేర్చుట సోదరమానవుని విధియైయున్నది. సంతసించినను సంతసింపకున్నను, దుఃఖించినను దుఃఖింప కున్నను, మానవుఁ డుపకారశీలుఁడై యుండినఁజాలును. అట్టిలోకబాంధ వుఁడు సుఖదుఃఖముల కతీతుఁడై యున్నాఁడను నెపమిడి, యాతని దూషిం చుట కెవరు పాల్పడుదురు?

హరిరాముఁ డాతనిపలుకులాలించి కన్నీటిఁ గొనగోటమీటుచు "నిజము నిజము. నీజైనపరమాత్ముఁడు వర్ణించినంత సులభముగా నట్టిపురు షోత్తముఁ డుండఁజాలఁడు" అనెను.

భద్ర:—(విస్మయముతో) 'ఓహో! అట్టిమానవుఁడు-అనఁగా ద్వం ద్వాతీతుఁడై యుపకారశీలియై యుండుమానవుఁడు పదికోట్ల కొక్కఁడైన నుండఁడు' అని జైనపరమాత్ముఁడు సెలవిచ్చియుండుటను నీ వెఱుంగవా?

పర:—మంచిది. ఈతర్క మిఁకఁజాలును. ఈకన్యావతంసము సంగతి నెఱుంగుదము రండు.

అని యాతఁడు సరస్వతిని డాసెను. అన్యాలోచనానిమగ్నురాలై యుండిన సరస్వతి కీద్వంద్వగుణవిమర్శన మెఱుక లేదు.

పర:—అమ్మాయీ! దేనిగుఱించి యంత యాలోచన? ఈపనికిమాలిన వాదనలఁగుఱించియా? రమ్ము. ఆయాసపడకుము. పోయి భుజింతము. రమ్ము! నాసతీసుతలఁ జూచుట నీకు సమ్మత మనుకొనియెద.

తయు, మీబాబు నిన్ను బుజ్జగించి యొడిలో వైచుకొనుచుండును. అప్పుడు నేను దిక్కులేక నిలువవలసియుండును," అని లక్ష్మి నవ్వెను. పార్వతీపరమార్థులుకూడ నవ్విరి.

భద్ర:—మాజైనపరమాత్ముఁ డిట్లేకదా సెలవిచ్చెను. 'పోరాటములం దెన్నటికిఁగాని పక్షము లవలంబింపకుము. నీజోక్యముతప్పని సరిగానుండినచో నిష్పక్షపాతబుద్ధితో మధ్యస్థ మొనరింపుము.'

పర:—ఎంతయు నిజము. లక్ష్మీ! ఇది నీకొఱకై చెప్పినమాట.

లక్ష్మి:—ఆబోధనమునకై జైనపరమాత్మునకుఁ గృతజ్ఞురాలను.

పరమార్థి, బాలాదిత్యుని, హరిరాముని, భద్రబాహువును, రఘుపతిని వెంటఁబెట్టుకొని, ధనభూషణునిగదికిఁ బోయెను. తనమిత్రుని, మిత్రుని మిత్రులను ధనభూషణు డుచితరీతి గౌరవించెను. నగరమునందలి విఖ్యాత సంగీతవిద్వాంసుల నాహ్వానించి, అతిథిగౌరవార్థముగా నాఁటిసాయంకాల మొక సంగీతసభను జరుప, ధనభూషణుఁడు సన్నాహము లొనరించుచుండెను. అట్టి గానసభ కతిథులు విముఖులైయుండుటను బరమార్థి గమనించి యా కార్యమును విరమించునట్లు ధనభూషణు నొప్పింపఁజేసెను. అందఱును భుజించి, ధనభూషణుని సౌధప్రాకారమునందలి ప్రమదోద్యానమునఁ బచారొనరింపసాగిరి. కుసుమితలతాంతములతోడను, ఫలభారవినమ్ర పాదములతోడను, అల్లిబిల్లిగఁ దిరిగియుండు కాలిబాటలతోడను, ఆయుద్యానరాజము మనోరంజకమైయుండెను. బాలాదిత్యుఁ డావనాంతరములఁ జేరి ప్రొద్దుపుచ్చుచుండెను. ఆరాజకుమారుఁ డొంటిపై నిలుచుండి యధోవదనమున నేమియో తలపోయుచుండెను. ఏటికో యాతం డొక్కమాఱు కన్నులెత్తిచూచెను. రూపొందిన లావణ్యరాశియో యనఁ దనయెదుట సరస్వతి యొకశిలాఫలకముపైఁ గూర్చుండియుండెను. సునిశితములును, సుకుమారములును, సానురాగములు నగు విలోకనమాలిక లాచంద్రముఖినేత్రములనుండి వెలువడి యాతనిపై వ్రాలుచుండెను.

బాలా:—సరస్వతీ! ఇది స్వప్నమా? సత్యమా?

సర:—ఆర్యపుత్రా! నిర్భాగ్యమగుసత్యము.

"కల్యాణాత్మకమగు నిట్టిసత్యము నింతకాలముగా నేను బొందియుండలేదు" అని బాలాదిత్యుఁడాతరుణీమణిఁ గన్నార్పక చూడసాగెను. భావగర్భితములును, కోమలములును నగువిలోకనములకు గుఱియై యాకన్యారత్నము, లజ్జాభరమునఁగాఁబోలు, ముఖము వివర్ణతఁజెందెను. ఆమోహనాంగి విలోకనము లాయుంపకుని మోహవీక్షణములతో వియ్యమందుచుండెను. నిష్కళంకములగు జీవాత్మ లొక్కటియైపోయెను. ఆమోహితు లొండొరుల ముద్దులిడుకోలేదు. ఒండొరులు కౌఁగిలింతలఁ బెనవైచుకోలేదు. కడ కొండొరులు కరస్పర్శనైనఁ గావింపలేదు. కాని వారిహృదయతలములుమాత్రము పరస్పరరూపముద్రితములై పోయెను. వారిభావము లొండొరుల కర్థమగుచుండెను. మధురములగు ప్రేమాలాపములకంటె మధురతరమగుమూనమొక్కింత తడవా కాముకీ కాముకుల వలఁచియుండెను. అంతట నిశ్శబ్దముగా నుండెను. ఇట్లొకనిముసము గడచెను. బాలాదిత్యుఁడు మౌనమువీడి "సరస్వతీ! ప్రాణనాయకీ! నీవు లేనినాజీవితము చీఁకటికొనయగుఁగదా!" అని మందస్మితముతోఁ బలికెను. ప్రేమాత్మకమగు నావాక్యామృతమును సరస్వతి వీనులఁగ్రోలి సంతోషపరవశురా లయ్యెను. అప్రయత్నముగా నాతరుణి దక్షిణహస్తమును బాలాదిత్యున కందిచ్చెను. ఆతఁడావనితామణి గరగ్రహణమొనరించి ముదమందెను. ఆమె కలకూజితస్వరమున "మనోహరా! నేను నీదానఁగదా!" అని పలికెను.

అనుటయే తడవుగా "ఓహో! ఇదేమిపని?" అని పరిహాసభాషణములు వారికి శ్రుతిగోచరమయ్యెను. ఆమోహితులు శబ్ద మరుదెంచినదిక్కుఁ జూచిరి. వెంకెనవ్వు వెదవులఁదాండవమాడుచుండఁ బార్వతి యచట నిలిచియుండెను. వా రామెను గాంచి ఆచ్చవడిరి. వారలను లజ్జ ముంచివైచెను.

"మీరేమేకాంతమున కడ్డుతగిలితినేమో యని నాకుఁ జింతగా నున్నది. నేఁబోయెదను." అని పార్వతి నవ్వుచుఁ బలికెను.

సరస్వతి విభ్రమనుణఁచుకొని "పార్వతీ! ఉండుము. పోవలదు. నీకు నాపై ననురాగముండినచో, నీవు కదలవు" అనెను.

"అయిన నేఁబోను. అవునమ్మా! ఎంతయో కన్నులపండువై యుండెను. 'సరస్వతీ! ప్రాణనాయకీ! నీవులేని నాజీవితము చీఁకటి కోనయగుఁగదా!' అని యాతఁ డనుటయు, 'మనోహరా! నేను నీదానఁగదా' అని నీవనుటయు దివ్యముగానుండెను. కాదా మఱి" అని పార్వతి వికటముగా నవ్వసాగెను.

సర:—పార్వతీ! ఈవిషయమును వెల్లడిచేయకుము......చేయుదువా యేమి?

పార్వతి:—చేయను. ఇంతకును దీనియందుఁ బదిమందికిఁ దెలియరాని దేమికలదు? కల్యాణమునకుఁబూర్వము వధూవరుల కిట్టియనుభవము యుక్తముసుమా! కొందఱియెడ నీయనుభవము చిరకాలము నిలిచియుండును. మఱి కొందఱియెడఁ దృణాగ్నివలె నప్పుడే చల్లాఱిపోవును.

అనంతరము పార్వతి బాలాదిత్యునిపై పుతిరిగి యభిమానపురస్సరముగా "వయస్యా! నేఁడు సుదినము. మానవసౌఖ్యముకొఱకు నిర్మితమైయుండు రత్నపుగని నేఁడు నీయధీనమైనది. విశుద్ధమగుప్రేమామృతమును నీకుఁ బ్రసాదించిన శుభచారిత్ర, సౌందర్యరాశి, యీ నీసరస్వతి యెంతయుఁ వంద్యురాలుసుమా! ఆమె యపాత్రదాన మొనరించెననుదూరుమాత్ర మామెకు రానీయకుము. అపూర్వమును అనర్ఘమునునగు నిట్టిపారితోషికమును దుర్వినియోగ మొనరించుయువకు లెందఱో నేఁడు కాన నగుచున్నారు. వారికి నీవర్తన మాదర్శప్రాయమై అనుసరణయోగ్యమగుఁగాక!" అని ప్రస్తుతించెను.

బాలా:—సోదరీ! నీయాదేశమునకు సాకృతజ్ఞతాభివందనములు. నీకు మనోవేదనఁ గల్గింపకుండునట్లు నేను సర్వవిధములఁ బ్రయత్నించెదను.

పార్వతి:—వందనములు. ఈనాటకమునకు భరతవాక్యము ముగిసిన దనుకొందును.

పిమ్మట వారుముగ్గురు తిరిగి యింటికివచ్చిరి. సరస్వతిప్రార్థనాదికము లేకడకేగినవో, పార్వతివాగ్ధానము లేమూలనక్కినవో కాని, తోటలోని నాఁటికథ క్షణములోఁ గడువిచిత్రముగా నింటియందంతయు నల్లుకొనెను. ఇఁక సరస్వతి నాఁడుపడినయవస్థలు చెప్పఁదరముకాదు. కడకు దాసీజనము కూడ నామెఁ గాంచి భావగర్భితముగా నవ్వసాగిరి. లక్ష్మిమాత్రము తొణఁక కుండెను. కాని యొక్కమాఱామె 'పార్వతికిఁగూడ సరస్వతికిఁ బోలె మంచి భర్తరావలయునని నాయభిలాష' అని నోరుజాఱెను.

ఇట్లా దినమంతయు గడచిపోయెను. సూర్యాస్తమయ మయ్యెను. సరస్వతిహృదయ మానందభరితమయ్యెను. మఱునటినాఁటినుండియుఁ నామె కీ తేనెబూసినకత్తికోఁతలు తప్పునుగదా ? కాని యెట్లుతప్పును? లక్ష్మిపార్వతు లిద్దఱును దనవెంటఁ దననొకయందే రానున్నారు. నావపైఁ దనకు దుస్సహ వేదన తప్పదని యామెకుఁ దోఁచెను. ఆహా! పార్వతి యానాఁ డాప్రేమ మయరంగమునకు రాకుండినసరస్వతి కెంతయో సంతోషముగా నుండెడిది. తనతో లక్ష్మిపార్వతులు కేరళమునకు రాకుండిన నామె సంతోషమపారమై యుండెడిది. కాని నాఁడాయుద్యానవనమునం దాప్రేమరంగప్రదర్శనము సంభవింపకుండినచో, సరస్వతి కోరికలన్నియు వమ్మైయుండెడివికదా; ఇట్టి యూహావళి, సరస్వతి మానసవీథియందు సాంద్రమైయుండెను.

మఱునాఁడు నౌకాశ్రయమంతయుఁ బ్రజలచే నిండిపోయెను. 'విక్రమ' నౌక నాఁడు తరలనున్నది. ప్రయాణికులబంధుమిత్రాదులు వారిని సాగనంపుటకై తండోపతండములుగ నచట మూఁగియుండిరి. వియోగభావ భరితము లగు వేదనారావము లంతట విననగుచుండెను. పథికులముఖములందు

కాని, వారిని సాగనంప నరుదెంచిన బంధుమిత్రాదుల వదనములందుగాని సంతోషరేఖాచిహ్నము మచ్చునకైనఁ గానవచ్చుటలేదు. ఆకాలమున సముద్రప్రయాణముపై నెవ్వరి కంతగా మక్కువలేకుండెను. సముద్రయానమునఁ గలయపాయములే దీనికి గారణము. సముద్రమును దాఁటిపోయినవాఁడు మరల ప్రాణములతోఁ దిరిగివచ్చునని చెప్పుట కెవ్వరికిఁగాని ధైర్యములేకుండెను. అందుచేఁ బ్రయాణికులును వారిహితవర్గమును వ్యాకులమానసులై యుండిరి. కాని పార్వతిహృదయ మంతదుర్బలముకాదు. సముద్రయానమున కామె యువ్విళులూరుచుండెను. అరమనసుతో నుందుసరస్వతిఁ దీసికొని యాఁతరుణి తరణియంతయుఁ దిరుగుచుండెను. ఇంతలో నావ బయలుదేఱువేళయయ్యెను. కడకు నావికునియాజ్ఞకూడ యయ్యెను. నావపైనుండుపాంథుల బంధుహిత వర్గము కళవళమొందసాగెను. చిరకాలముగాఁ దమహృదయాలవాలముల యందుఁ బ్రేమతోయములచేఁ బెంపొందింపఁజేసిన భావాంకూరముల నొక్కమాఱుగాఁ బెఱికివేయలేక వారు కుందుచుండిరి. విభ్రమాత్మకములగు దుఃఖారావములు రోదసీకుహరమును నించెను. అందఱును జేతులు విసరుచుండిరి. టెంకాయలు కొట్టుచుండిరి. ఇట్లు 'విక్రమ' బారుకచ్ఛమువదలి సముద్రమధ్యముఁబట్టెను. నౌకాశ్రయమునుండి స్వగృహాభిముఖులైనవారిలో ధనభూషణుఁడు కడపటివాఁడు. ఆతడు కనుచూపునకు మఱుఁగైనపిదప లక్ష్మి పార్వతి సరస్వతు లొకయెడఁ గూర్చుండిరి. అట్లే హరిరాముఁడు, బాలాదిత్యుఁడు, పరమార్థి, భద్రబాహువు, రఘుపతియు నొకయెడ నాసీనులైరి. మున్ముందు హరిరాముఁడు స్వారణ్యములకుఁ బోనెంచెను. కాని సరస్వతీ వియోగమును సహింపనోపక, యాతఁడుకూడఁ గేరళమునకుఁ బైనమయ్యెను. జీవహింసాపరాయణుఁ డగు హరిరాముఁ డిప్పుడు కుసుమకోమలహృదయుం డయ్యెను. కడ కాపురుషసింహుఁడు కురంగనయనలగు పార్వతీసరస్వతుల కనుసన్నల మెలఁగుచు వారి యడుగులకు మడుఁగులొత్తసాగెను.

సముద్రయానములందలి మొదటిరెండుమూఁడుగంటలు సంతోషప్రదములైయుండెను. సముద్రము ప్రశాంతమైయుండెను. దృశ్యవిబేధము

కన్నులపండువై యుండెను. కాని పరిణామవిహీనమైయుండు సాగరదృశ్యము పార్వతికి విసుగుఁగొల్పుచుండెను. ఆమెయందలి యుత్సాహాగ్ని యాఱి పోయెను.

పార్వతి:—బాబూ! సింధువునందుఁ బలుదీవులుండు ననుకొంటిని. కొద్దిపాటిదీవులతో నుండు నీయుదధి పాడువాఱియున్నది. కంటికింపుగాఁ గొన్నివృక్షము లగపడిన బాగుండును.

పర:—అమ్మాయీ! నీవు వసుమతిపైనుండునప్పుడు, సరోవరములు సాగరములు కావలయుననుచుంటివి. ఇప్పు డబ్ధిపైనుండఁగా భూమికొఱకును, భూరుహములకొఱకును దేవులాడుచున్నావు.

పార్వతి:—అవును. అందేమి దోషము కలదు? మనకు రెండును గావలయును. రెండును దైవనిర్మితములేకదా!

విచిత్రమగు నీసిద్ధాంతసారము పారమార్థికపగతము కాలేదు. అతరు ణీత్రయమునకుఁ గ్రమక్రమనుగా నచటిపరిస్థితులు సరిపోవుచుండెను. వారికి సముద్రయానమునందలి చీదఱతగ్గెను. ఈవైపున కావైపునకు నొఱఁగుచు ముందుకు సాగిపోవు నౌకయూపులకు సమానముగ వారుకూడ సద్దుకొనుచు నవ్వుకొనుచుండిరి. పగటిపూటఁ బైనుండునీలాంబరమును, క్రింద నుండునీలయతోయములఁ గాంచి వారు సంతోషించుచుండిరి. నిశాసమయమున నీలాకాశమున వ్రేలాడుచు నిత్యసంశోభితములై యుండుతారకలఁ జూచి సంతోషమున నోలలాడుచుండిరి. వారికి విసుగెత్తినపుడుమాత్రము పరస్పర సంభాషణమునందో, సరస్వతిని మేలమాడుటయందో, కాలము గడపుచుండిరి. లక్ష్మీపార్వతులు సరస్వతియెడ నభేదప్రతిపత్తిఁ జూపుచు సగోత్రులవలె మెలఁగుచుండిరి. సాధారణముగ సరస్వతి పార్వతినిబాసి దినమున కొకయర ఘంట గడపుచుండెను. ఆయరఘంటసేపామె బాలాదిత్యునితో మాటలాడు చుండెను. అట్టియెడ నితరు లెవ్వరైనఁ దమ్ము డాసినపుడు సముద్రవర్ణనమునకో, తారకాగణమాహాత్మ్యమునకో, కేరళదృశ్యమునకో యాసంభాషణము తిరుగు

చుండెను. ఏకాంతసమయములందు వారి కాసముద్రములు, తారకలు, కేరళము మఱుపునకువచ్చెడివి. పవిత్రతరమగుసంభాషణమున-కాముకీకాముకులకు సర్వసాధారణమగు ప్రేమసంభరితసంభాషణమున-వారు తన్మయులై యుండిరి. సరస్వతితో భాషించునపుడు బాలాదిత్యుఁ డత్యుత్సాహమున నుండును. తదితరసమయములం దాతఁడు చిత్తశాంతి యనుమాట నెఱుఁగఁడు. చ్యుతసామ్రాజ్యము-హూణరాజ్యస్థులగు ప్రజలయిడుమలు-ఉత్కృష్టపారిశ్రామికకళాప్రావీణ్యమును బ్రకటించుసంస్థలను గొల్లఁగొనుహూణుని దుష్కృత్యములు-దాసులై యుండు ప్రజల నానాఁటికిఁ దొలిచివేయుపందతనము-దేశము నపూంతముగఁ గబళింపనుండు కరాళక్రూరస్థితి-అన్నియు మూర్తులుదాల్చి యాతనిహృదయతలమునఁ జిందులు ద్రొక్కుచుండెను. ఎంతప్రయత్నించినను, ఆతనికి హరిరామునిపై దురభిప్రాయము సమయకుండెను. ఇంతకును హరిరాముఁడు దొంగలరాయఁడుకదా! గుప్తరాజన్యులు ప్రజోపద్రవకరులకు నుగ్రశాత్రవులై యుండలేదా? విక్రమాదిత్యునికాలమున నీధారుణియందు దొంగతనమనుమాటయే లేకుండెను. అచటిహరిరామునియునికి, గుప్తరాజ్యసంక్షయజ్ఞాపకార్థము నిలిపినస్తూపముగా బాలాదిత్యునకుఁ దోపింపఁజేయుచుండెను. హరిరామునకుఁగూడ బాలాదిత్యునితో భాషించునపుడంతయుఁ జిత్తశాంతి యనునది లేకుండెను. ఎన్నోమాఱు లాతఁడు మరల నీచకృత్యములకుఁ గడంగనని బాసచేయుచుండెను. అవసరమునుబట్టి తానట్టి కార్యములకుఁ బాల్పడితినని, యాతం డెన్నియోమాఱులు తీవ్రముగా వాదించుచుండెను. కాని పూర్వచారిత్రమును మానసతలమునుండి తుడిచివేయుట కాతనికి శక్తిచాలకుండెను. పాపకార్యపరంపరలచే నాతనియశము కళంకితమై వన్నెవాసియుండెను. హరిరాముఁ డరణ్యములఁ జేరుటకు ముందు చూచుచున్నంతస్నేహవీక్షణములతో, నిప్పు డాతనిఁ జూచుటకుఁ బరమార్థికిష్టము లేకుండెను. ధనాఢ్యుఁడగు నావణిక్పుంగవునకును, క్రూరుఁడగు నాదొంగలమిండనికి మధ్య స్వభావసిద్ధమగు నొకయడ్డంకి నిలిచియుండెను.

ఆయడ్డంకి వారిద్దఱకు విశదముగాఁ దెలియుచుండెను. రఘుపతికి హరిరాముని యందు స్నేహభావము కలదు. కాని సజ్జనుఁడగు పాపనకుఁ దుర్జనుఁడగు చోరునిపై స్వభావముగనుండు భీతిమాత్ర మాతనిఁ బాసినది కాదు. సరస్వతీ పార్వతులు తమసుధాసమానసరసాలాపముల హరిరామునిపరితాపవహ్ని నార్పుచుండిరి. ఇట్టి యూఱడింపులచే హరిరాముఁడు తాను దొంగలరాయఁ డనుమాటయే మఱచిపోయెను. మానవు లందఱివలెఁ దానుగూడ మన్ననలఁ గాంచుచుండుట నాతఁడు గ్రహించెను. తనపై నిట్టికృపామృతము గుఱియించినపరమాత్మున కాతఁడు కృతజ్ఞతాభివందనము లర్పించుచుండెను. ఆతని నేత్రగోళము లానందాశ్రుజలమయము లగుచుండెను. భద్రబాహువు హరిరామునియెడ విధేయుఁడై వర్తించుచుండెను. కాని రేయింబవళ్లు భద్రబాహువు వినిపించుజైనమతసిద్ధాంతము లాతనికిఁ జీకాకుఁ గొలుపుచుండెను. జైనసిద్ధాంతములకును హరిరామునిమతమునకును హస్తిమశకాంతర మున్నది. అట్లుండియు హరిరాముఁడు నౌకపై వ్యాకులుఁడై యుండినవాఁడు కాఁడు. సముద్రప్రయాణమంతయు నాతని కానందసంధాయకమై యుండెను. 'విక్రమ'నౌక యెడనెడ నౌకాశ్రయముల నాఁగుచు, ముందు పయనమున కవసరములగుసామగ్రిని, నీటిని దీసికొనుచుండెను. అట్టిసమయముల వణిజులు తీరమునకుఁ జని తమసామగ్రు లమ్ముకొనుచుండిరి. నావికులును, ప్రయాణికులును కూలములఁ జేరి విశ్రమించుచుండిరి. ఇట్టి భూవసతులవలన సముద్రప్రయాణమువలని విసిఁగించుక సన్నగిలుచుండెను. ఇట్లు ముప్పదిదినములు గడచెను. కడ కానౌక క్రాంగనూరు చేరెను. ఆకాలమునఁ గేరళమునందలి నౌకాశ్రయములన్నింటిలోఁ గ్రాంగనూరు చాల ముఖ్యమైనది. నౌకాశ్రయమునకు నావ యొకటివచ్చినదని ప్రచురమగుటయే తడవుగా, జనులు గుంపులుగట్టి వచ్చిరి. నౌకనుండి పాంథులను దీరములకుఁ జేర్చుటకై పడవలు, తెప్పలు సిద్ధమయ్యెను. ఆనౌకపై నరుఁదెంచిన వణిక్ఛేఖరుల నాహ్వానించుటకై, క్రాంగనూరురాజు తనకంచుకిని నియమించెను. ఆనావపైవచ్చినసర

కులను పిలుచుకొని వెంచి తన్నగరవాసులగు వైశ్యులుకూడ వచ్చిరి. అచట కూలివాండ్రకుఁ గఱవులేకుండెను. కూలీ! కూలీ! అని కొందఱు అఱచుచుండిరి. అచట సందడి మిక్కుటమై యుండెను. మార్గమంతయు వర్తకుల చేతను, కూలివాండ్ర చేతను నిండి వెసురుపోటవలె నుండెను. నౌకనుండి తీరమును జేరుటకుఁ బ్రయాణికులు శ్రమనందుచుండిరి. ఆజేరగాండ్రవలనఁ బరమార్థికేమాత్రము తీఱిక లేకుండెను. తనమిత్రబృందము తనపని తీఱువఱకు లక్ష్మీపార్వతులకడ నుండునట్లు పరమార్థి యేర్పాటుగావించెను. పరమార్థి యొక ఘంటలో జేరసారముల ముగించుకొని, తనకై వేచియుండుమిత్రవర్గమును జేరెను.

పర:—అయినది. మనమింకఁ బోవుదము. నేను మిమ్ములవిడుచువఱకు, మీరు నాయతిథులని నమ్ముఁడు.

అడ్డుమాటలవలని ప్రయోజనము లేకుండెను. బాలాదిత్యుఁ డెన్నో యాక్షేపణలు చేయసాగెను. అందులకుఁ బార్వతి ఖండితముగ "కావలసిన నీవుమాత్రము పోవచ్చును. కాని నీవెంట సరస్వతిమాత్రము రాదనినమ్ముము. దీనివలన నీవుపోవని తేలుచున్నది." అని చెప్పెను.

ఇందుల కందఱు నవ్విరి. బాలాదిత్యునకు సిగ్గయ్యెను.

పార్వతి:—సిగ్గెందులకు? అంతయవసర మేమివచ్చినది. మాతోనుండి యీకేరళమునందలి యేదేవాలయమునందైనఁ బెండ్లాడుఁడు.

వివాహప్రస్తావమున బాలాదిత్యసరస్వతులయుల్లములు జల్లనెను. వారు లజ్జావనతముఖులైరి.

పార్వతి:—అంత సిగ్గెందులకు? వివాహమనుసంస్థను బ్రపంచమునందు దైవము స్థాపించియున్నాఁడు. వివాహబద్ధము కాకున్నఁ బ్రపంచము నిలువదు.

అని యామె నవ్వుచు సరస్వతి చేయిపట్టుకొని నడువసాగెను. పరమార్థి మార్గముచూపెను. అందఱును వారి ననుగమించిరి. తనమిత్రునిగృహ

జెవులకొఱకు నారాయణశర్మ బసకుఁ బోయెను. 'ఈదురాత్ములు మనయువరాజుగారిని గాయపఱచిరి. కాన వీరిని రెండింతలుగాఁ జావమోదుఁడు' అని కాడ్ఫిసాసు సెలవిచ్చియుండెను. అచట నారాయణశర్మ లేనందున నాసేవకుఁడు కారాగృహములకడకుఁబోయెను. అన్నిగదులు తాళములువేయఁబడియుండెను. వెంటనే వాఁడు కాడ్ఫిసాసుకడకుఁబోయి "నారాయణశర్మ యెక్కడ?" అని యడిగెను.

"నాకుఁ దెలియదు. ఆతఁడు బసలో లేఁడా?"

"లేఁడు."

తోడనే నారాయణశర్మ నన్వేషించుటకై యంద ఱన్నిమూలలకుఁ బోయిరి. కాని ప్రయోజనము లేకపోయెను. అంత నాగదితలుపులను వారు గడ్డపాఱలతోఁ బగులఁగొట్టిరి. ఆగదులయం దెవ్వరు కానలేరు. కాడ్ఫిసాసు కుపితుఁడై "ఆహా! ఆదుష్టాత్ముఁడు నారాయణశర్మ యాపాపిష్ఠురాలి మోహవాగురులఁ జిక్కి తనతోడిబానిసలను—యీబంధితులను విడిచియుండును." అని పలికెను. సరస్వతి బంధితయైయుండిన గదితలుపులఁగూడ ఛేదించుట కాతఁ డాజ్ఞఁజేసెను. కాడ్ఫిసాసు ఆచీఁకటికోనలోనికిఁ బోయెను. తరుణారుణకిరణము లప్పుడే ప్రసరించుచుండెను. నారాయణశర్మ నిర్జీవశరీరము కొయ్యబాఱి నెత్తుటఁ దోఁగుచు నేలపైఁబడియుండుట నాతఁడు చూచెను. కాడ్ఫిసాసు విభ్రాంతుఁడై యుస్సురనుచు నచటఁబడియుండు లేఁతటెంకాయఁ గైకొని "కడ కీనిర్భాగ్యుఁ డొకస్త్రీసాహసకృత్యమునకు లోనయ్యెఁగదా! ఆహాహా! ఈతని నెత్తు రెంత నల్లగానున్నది. కాని యింకను నల్లగా—యెంతయో నల్లగా—నీతనిహృదయ ముండితీఱవలెను. ఆకన్య హూణాంగనయై యుండుటకుఁ దగియున్నది!" అని తలంచి తనయనుచరులఁ గాంచి "మిత్రులారా! ఖైదీలవిముక్తికి మనమందఱము బాధ్యులము. హూణరాజేంద్రుఁ డీయుదంతము నాలకించినయెడల, మనశిరముల నుత్తరింపక మానఁడు. అది న్యాయసమ్మతమనికూడ నాయభిప్రాయము. భయోత్పాదక

మగు హూణపాలనమునం దిట్టిశిక్షలు సామాన్యములు. కుక్కలవలె నఱచి చచ్చుటకంటె, మానసంతులవలె మనమేల యాత్మహత్యఁగావించుకోరాదు!" అని యుద్బోధించెను.

"అందుకు మేము సంసిద్ధులము" అని మిగిలినయిరవైతొమ్మిదిమంది యఱచిరి. అనంతరము కాడ్ఫిసాసు దేవరవారికి జాబువ్రాసి, తనవెంటవాఁడగు నన్నుఁబిలిచి, దేవరవారి కాలేఖనిచ్చి యాకథనంతయు నివేదింప నాజ్ఞఁ జేసెను. అంతట వారు దారుణవిషమునుగ్రోలి పరలోకమునకుఁబోయిరి."

మిహి:—అయిన నిప్పుడు హూణగృహమునం దెవరు కాపున్నారు?

"చేష్టనునితండ్రి నాహపాణుఁ డున్నాఁడు."

తోర:—ఆఖైదీ లిపు డెచటనున్నారు?

"దేవా! నాకుఁ దెలియదు."

తోరమానమిహిరగులులు, బంధితులపోవడఁదీయుటకై, కొందఱు గూఢచారులను నలుమూలలకుఁ దఱిమిరి. బాలాదిత్యయశోధర్మలఁగూడ వెదకుటకు వారలకుఁ గట్టడచేసిరి. హూణులు హిందువులనే తమగూఢచారులనుగ నేలుకొనిరి. ఆగూఢచారులు ప్రజ్ఞాధురీణులు. ఎంతయన్యాయమున కైన వెనుదీయువారుకారు. ఆవృత్తిని స్త్రీపురుషులంద ఱవలంబించియుండిరి. ఈగూఢచారులలో ముఖ్యులు బ్రాహ్మణులు. కాయస్థులు. వారిలోఁ గాలాగ్ని, సర్వసమ్మతుఁడు, సుమతి యనువార లసమానచాతురీధురీణులు. సుమతి స్త్రీ. హూణరాజేంద్రునకు వీరుమూవురును నమ్మినబంట్లయియుండిరి. హరిరాముని యడవులకుఁ గాలాగ్నియు, పశ్చిమతీరమునందలి నౌకాశ్రయములకు సర్వసమ్మతుఁడును, మహాకోసలమునకు సుమతియుఁ దోరమానునియాజ్ఞాచోదితులై పోయియుండిరి.

అందఱకంటెఁ గాలాగ్ని ముందుగావచ్చి, తాఁబోయివచ్చినకార్యమునుగూర్చి, తోరమానున కీవిధమున విన్నవించసాగెను.

"దేవా! నిష్ఠాపరుఁడగు సన్యాసివేషముతో నేను హరిరాముని నడ వులకుఁ బోయితిని. ముమ్ముం బాదొంగలు నన్ను గూఢచారియని సంశయించి, నన్నుఁ గూడఁబెట్టిరి. కాని నేనుమాత్రము వేదములను, ఉపనిషత్తులను, భగవ ద్గీతలను విడువక చదువుచుంటిని. శమదమాది సత్త్వగుణప్రధానుఁడనై చరించుచుంటిని. మతవిధులను సకాలమునకు నిర్వర్తించుచుంటిని. కడకు నాకుహనాచర్యలన్నియుఁ గార్యకారులయ్యెను. అందఱు నన్ను విశ్వసించిరి. నాకు వలయుసంగతులనన్నింటిని, నేను వారికడనుండి తోడుకొనుచుంటిని. బాలాదిత్యుఁడు, యశోధర్మ, గుప్తరాజులకు బాంధవుఁడు మఱియొకఁడు. వాని పేరు నెఱుంగుటకు నాకు సాధ్యముకాలేదు. ఈముగ్గురును బంధితులఁ దొలిహూఱు తప్పించినారఁట."

తోర:—అయినఁ జేష్టునిమాట లబద్ధములుకావు?

"కావు. దేవా! బంధితులను మరలఁ బట్టుకొనుట, హూణగృహమున వారిని బంధించుట, నారాయణశర్మను సరస్వతి హత్యగావించుట, బంధితులందఱు తప్పించుకొనుట, తిరిగి వారంద ఱడవులకుఁబోవుట, సరస్వతి, భద్రబాహువు, రఘుపతి, హరిరాముఁడు బారుకచ్ఛమునకుఁ బోయి యట నుండి 'విక్రమ' నావపైఁ గేరళమునకుఁ బోవెంచుటాదిగాఁగలవిషయములను సవిస్తరముగా నెఱింగివచ్చితిని."

తోర:—ఈక్షణమే బారుకచ్ఛమున కొకసేవకునిఁ బంపుము.

"దేవా! పంపియు ఫలములేదు. ఆనావ బారుకచ్ఛమునుండి బయలు దేఱి పదునైదుదినములైనది. బాలాదిత్యుని పోవడిఁగూర్చి, సర్వసమ్మతునకుఁ దెలియఁజేసితిని. కాన నాతఁడు కేరళమునకుఁబోయి యచటి నిజపరిస్థితులను దేవరవారికి నివేదింప గలఁడు."

తోర:—కాలాగ్నీ! నీవును నాతనివెంటఁ జని సమస్తవృత్తాంతము నెఱుంగ నేల ప్రయత్నింపవైతివి?

మిహి:—నీకు శత్రుపక్షమువారు లంచమియ్య మాటనిచ్చిరి కాఁబోలు.

"దేవరవారు నన్నుఁదప్పుఁదలఁచుచున్నారు. నేను హూణకూఁత చాఁకనని యీదొంగలకుఁ దెలిసియుండినచో, దేవరలంద ఱొక్కమొత్తమై వచ్చినను నన్నుఁ గాచియుండెడివారు కారు. ఆదొంగలమధ్య మెలఁగుచుండి నంతకాలము, నేను ఖడ్గధారపై నుండిన ట్లుంటిని. పలుకకపలుకక యొక్కఁ తెలివితక్కువపలుకుపలికి నాకు రాజకీయములందు జోక్యముకలదని వారి కించుకయైనఁ దెలియఁజేసియుండినచో, నేనిప్పటికి యమాలయమునఁ బ్రాంత కాఁపై యుండెడివాఁడను. దేవరవారియాజ్ఞకై నేనిట్టిగండముల నెదుర్కొని తప్పి బయటఁబడిరాఁగా, మీరు నన్ను ద్రోహాత్ముఁగా సంశయించుచున్నారు గదా!"

తోర:—కాలాగ్నీ! నాపుత్త్రునిపలుకుల లెక్కసేయకుము. వాఁడు పసివాఁడు, వానికి లోకజ్ఞాన మంతగాలేదు. నిన్నొక మోటముగా నాటలాడుట మంచిదని యాతనియభిప్రాయము. కాని యెట్టిదశల నయ్యది కార్యకారి కానేరదు.

"దేవరమాట సత్యము."

తోర:—ఈదొంగలగుంపును మనము సర్వనాశ మొనరింపఁగూడదా?

"దేవా! అది సులభసాధ్యముకాదు. కాని రణరంగభీములగు మీ యట్టిరాజవరేణ్యుల కసాధ్య మేమికలదు? ఇంతకు వచ్చినకష్టమేమన, ఆ దొంగలు మనయెదుటఁబడి పోరాడరు. బిడ్డకుఁ దల్లిఱొమ్ములు తెలిసినట్లు, వారి కడవియంతయుఁ దెలియును. చూచుచుండఁగనే వా రాప్రదేశముల యందు దాఁగి, మాయమై పోవుచుందురు."

తోర:—కాని వారిపు డనాథులై యున్నారుగదా?

"అవును. కాని యీదొంగలయెడ 'స్వయంరాజా స్వయంమంత్రీ' యనునానుడి యన్వర్థమైనది."

తోర:—హూణులుకూడ నట్టివారేకదా!

"అవును. దేవా! ఆదొంగలకు హూణు లేవిధమునఁ దీసిపోరు."

తోర:—ఈచోరవినాశనునకుఁ జక్కనియుక్తి యేమైనఁగలదా? ఇందులకు నీవేదియేని తెలుపుఁజూపినచో, వేయిబంగారునాణెములు నీకు బహూకరించెదను.

''నేనెల్లప్పుడును దేవరవారిపాదరాజీవముల నాశ్రయించియుండు వాఁడను. చతురుపాయచాతురీధురీణుఁ డాచాణక్యసచివోత్తముఁడు. కత్తిపోటుకంటెఁ గలముపోటు మిన్నయనియు, శౌర్యోపాయములు రెంటిలో రెండవది కార్యకారియనియు నెంతయో నిజముగ వ్రాసిచ్చియున్నాఁడు. ఆచోరసమూహమును రూపుమాపుటకుఁ బ్రజ్ఞానిధి యొకఁడైన నోపుఁగాని, వేయి వీరులైనఁజాలరు.''

తోర:—వేయిబంగారునాణెము లిచ్చెదను. ఆదొంగలగుంపును నాశ మొనరించుటకు నీవు సమ్మతింతువా?

''ఆకార్యము గొంతుమీఁదికత్తివంటిదిసుమా! అందులకుఁ బ్రాణముల నఱచేతఁబెట్టుకొని దిగవలయును.''

తోర:—అయిన మూఁడువేలుగా నిచ్చెదను.

''దేవరచిత్తము. దీనికి గడువు మూఁడునెలలు దయసేయుఁడు. ఈ లోపల నాదొంగ లడవులవిడిచియైనఁ బోవలయును. లేక యసువులవిడిచి యైనఁ బోవలయును.''

తోర:—భళిభళి! అయినఁ ద్వరగాఁబొమ్ము. చూచితివా? ఈమూఁడు వేల బంగారునాణెము లిచట నీరాక కెదురుచూచుచుండును.

అని యాతఁడు బంగారునాణెములసంచిని గలగలలాడించెను. కాలాగ్ని ముఖమున నసంతుష్టభావము తోఁచెను.

తోర:—నీకేమికావలయును?

''ఏమియువలదు. మాయింటియందు సంభారసాధకము లేమియులేవు. నాగృహిణి చింపిచీరలతో నున్నది. నా......''

తోర:—ఓహో! బాలాదిత్యునిపోవడిఁదియుటకు నీకు నైదువందల నాణెములు కావలయునందువా? ఔనా?

కాలాగ్ని యేమియుఁ బలుకలేదు. తోరమానుఁడు సంచివిప్పి యేనూరు బంగారునాణెముల నాగూఢచారి కొసంగుచు "మీరు బ్రాహ్మణులు, మిగుల నేర్పరులు. తిమ్మిని బ్రమ్మిని, బ్రమ్మిని తిమ్మిగామార్చి, మీపనుల నెఱవేర్చుకొనుచుందురు. మంచిది. పోయి, నీకార్యమును సాధింపుము." అని కొండాడెను.

"చిత్తము" అని కాలాగ్ని రాజమందిరమునుండి బయటికరుదెంచెను. భానుగుప్తుండాతనిసింహద్వారముకడఁ గలిసికొని, నిరపాయమగుస్థలమున కాతనివెంట నడచెను. అచటఁ గాలాగ్ని యాతనితో "నేను నీప్రస్తావనను వదలి, నీకుఁ బ్రాణదాన మొనరించితిని. ఆకొఱవ యైదువందలనాణెము లిచ్చెదవా?" అని యడిగెను. "ఇవిగో! ఇచటనేయున్నవి" అని భానుగుప్తుఁడొక బంగారునాణెములమూట నాతని కిచ్చెను.

భాను:—ఆబంధితులఁ దోలిపోవుచుఁ గాపాడిన పురుషత్రయములో మూఁడవవానిని నీకుఁ దెలియనట్లు నటించితివని, నాగూఢచారి నాతోఁ జెప్పినాఁడు.

కాలాగ్ని:—ఔనౌను. సుముఖుఁడుగదా? వాని నచటఁ జూచితిని.

భాను:—అయినఁ గాలాగ్నీ! మూఁడువేలుసువర్ణనాణెముల బహుమతిగా గ్రహించి, హరిరాముని, యాతని యనుచరవర్గమును అరణ్యప్రాంతములనుండి తఱుమనున్నావా?

కాలాగ్ని:—అవును. అందులకు నేను జాలనందువా?

భాను:—నీ కసాధ్యకార్యముకలదా?

కాలాగ్ని:— మిత్రమా! చెప్పెద వినుము. గూఢచారునిజీవితమునకు సౌఖ్యమనునదిలేదు. ఆతని నెవ్వరు నమ్మరు. కడ కాతనియజమానులు సైతము నమ్మరు. పొరపాటించుకయైన వాటిల్లిన నాతనికిఁ బ్రాణాంతకమగును. చార

వృత్తియందు జయము నాకాక్షించువాఁడు. అనురాగమునకు హస్తోదకములు విడువవలయును. ధర్మమును దఱిమివేయవలయును. మతమును మట్టుపెట్టవలయును. జయశీలుఁడును, లక్ష్మీలాలితుఁడు నగుగూఢచారికంటె, ఏగంగయొడ్డుననో యేనర్మదాకూలముననో ముక్కుమూసికొనియుండు పేదబాపఁడైన సుఖముగనుండును. అట్టివైరాగ్యవృత్తి ననుసరించుటకు నాకెంతయో కాలముగా గోరికయున్నదిగాని, సమయమునకేదియో యొకటి యందుల కడ్డంకియై నిలుచుచున్నది. కాని, నేనిప్పు డొక్కమాఱుగా నిర్ధారించుకొంటిని. ఇఁక దీనికిఁ దిరుగులేదు. ఈకార్యమగుటయే తడవుగా, నేను జాయానమేత ముగా నర్మదానదీకూలమునకుఁబోయి, మునినై కాలము గడుపుచుండెద.

భాను:—'అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్' అని యుండలేదా?

కాలాగ్ని:—ఇది యెంతయు నిజము. కాలగర్భమును శోధింప నెవరి వశము? మంచిది. సెలవు. హరిరాముని యడవులకుఁ బోవుచున్నాను.

భాను:—మంచిది.

వారిండొరులవీడి చనిరి. పదినిముసములైనపిదప, సుముఖుఁడు భానుగుప్తుఁజేరి, తోరమానకాలాగ్నులసంభాషణమును వివరముగాఁ జెప్పెను. అంతట నాతఁడు సుముఖుని బహుమానపూర్వకముగా సాగనంపి, ఉజ్జయిని యందలి తనవిడిదికిఁబోయెను. నారాయణశర్మమరణమునకై యాతఁడు లోలోన నుప్పొంగుచుండెను. ఆబ్రాహ్మణాధమునిచావుచే, భానుగుప్తుని హృదయమందలి శంకాశల్య మూడిపోయెను. ఇఁక హూణులు తన్ను సంశయింపరని యాతనికి సంతోషమయ్యెను. కాని కాలాగ్నిపై నాతని కేమాత్రము నమ్మకములేదు. ఎప్పుడో యొకప్పు డావిశ్వాసఘాతుకుఁడు తన్ను బయటవేసి తీరుననియు, ఆతఁడు జీవములతో నుండునంతవఱకు సౌఖ్యము తన్నుఁ జేర దనియు భానుగుప్తుఁ డెఱుఁగును. 'ఎట్టులో యొకట్టుల యీప్రక్కలోని బల్లెమును మట్టుపెట్టినఁగాని, నాకుఁ గూర్కుపట్టదు' అని యాతఁ డనుకొనెను.

అతఁడు దూర మాలోచించెను. అనంతర మాతఁడు తనపుస్తకభాండాగారమునకుఁబోయి రాజ్యపాలనాక్రమముంగూర్చిన గ్రంథము నొకదానిఁదీసికొని, రాజులఁగూర్చి వ్రాసియుండు ప్రకరణమును జూచెను. అతనిచూడ్కికిఁ దగిలిన వాక్య మియ్యది. "తనరహస్యమును—వెల్లడియైనఁ దనకంటకమున కునికిఁ దగిలించుదానిని—తెలిసినమానవుని, రాజగువాఁడు న్యాయముగనో యన్యాయముగనో పరలోకమునకుఁ బంపివేయుటకై సర్వవిధములఁ బ్రయత్నింపవలయును. ఆమానవుఁడు సజీవుఁడైయుండునేని యెపుడు నేమి వెల్లడిచేయునో, యేమి చేయఁడో చెప్పుట కెవరికిశక్యము? చచ్చినవానియందుమాత్రము సంపూర్ణ విశ్వాస ముంచనగును." భానుగుప్తుఁ డానందాంతరంగుఁడై "ఆహా! వెదుకఁ బోయినతీఁగె కాలఁదగిలినది" అని, కర్తవ్యాంశమును నిర్ధారణచేసికొనెను. ప్రియభృత్యుఁ డగువిశ్వనాథునిఁ బిలిచి భానుగుప్తుఁడు వానిచెవిలో "విశ్వనాథా! నీవిపుడే హరిరాముని యడవులకుఁబొమ్ము. పోయి, దొంగలతో 'తోరమానునిచారుఁ డొకఁడు కాలాగ్ని యనువాఁడు మిమ్ములఁ జేరి, కపటనటనలచే మిమ్ముందఱ హతమార్చుచున్నాఁడు. మీయడవులందు యతిరూపధారియై కొంగజపము నొనరించువాఁడే యాగూఢచారి కాలాగ్ని.' అని నచ్చఁ జెప్పుము. ఈసంగతి నొరులచెవులవేయకుము." అని యానతిచేసెను.

"దేవరవారిచిత్తము." అని విశ్వనాథుఁడు వెడలిపోయెను.

"ఇఁక మూఁడుదినములలోఁ గాలాగ్ని యమునింటఁ బ్రాఁతకాఁపై యుండఁగలఁడు. వాఁడు నర్మదానదిగట్టుపై నుండునేమోకాని, వైతరణీనదీకూలమునమాత్ర ముండుట నిశ్చయము. హాహాహాహా! ఔనౌను! మానవుఁ డొకటితలంచిన, మాధవుఁ డొకటితలంచునుగదా?" అని భానుగుప్తుఁ డనుకొనెను. మఱునాఁ డాతఁడు తోరమానమిహిరగులులకడ సెలవుగొని, స్వరాజ్యమగుపశ్చిమమాళవమునకుఁ దరలెను.

తోరమానుఁడు తాలిమిమాని, సుమతీసర్వసమ్మతులకొఱ కనుక్షణ మెదురుచూచుచుండెను. భానుగుప్తుఁడుపోయిన యైదవనాఁడు రాజమందిర

మున కొకమానవుం డరుదెంచెను. ఆమానవుఁడు సర్వసమ్మతునికడనుండియో, సుమతికడనుండియో వచ్చినవార్తావహుఁడై యుండునని తోరమానుం డనుకొని, వానివిన్నపముల నాకర్ణింప నాతురుఁడైయుండెను. ఆవార్తావహుఁ డాతనిఁజేరి "జయజయమహారాజా! కాలాగ్నినిగుఱించిన సమాచారములతో వచ్చినాఁడను" అనెను.

తోర:—ఏమైనది? ఆతఁ డాదొంగలగుంపును మట్టువెట్టెనా?

దూత:—దేవా! లేదు. ఆచోరు లాతనిఁ జంపివైచిరి. వారెట్లో యాతనిమర్మమును బసిపట్టిరి. వారాతని యథారీతిగానమ్మినట్లు నటించుచు, ఉన్నట్లుండి యాతని ముక్కలుముక్కలుగాఁ గోసివైచినారు. ఆతనినాలుకపై వాఁతలువేసిరి. ఆతనికన్నులఁ బెఱికివైచిరి. ఆతఁడు జీవములు వాయునంతవఱకు నొక్కొక్కయంగమును జీల్చివైచిరి.

తోర:—ఏమీ! అయిన నారాక్షసాధము లిపు డెచటనున్నారు?

దూత:—దేవా! వారు తూర్పుగాఁబోయిరి.

తోర:—ఈహత్య యెపుడు జరిగినది?

దూత:—దేవా! రెండుదినముల క్రిందట. కాలాగ్నిశిరమును నిన్న భానుగుప్తుని ప్రాసాదమునందుఁ బాఱవేసిరి. దానితోఁగూడ నొకలేఖయుండెను. 'బాలాదిత్యునిభృత్యులమును, హరిరామునియనుచరులమును నగుమేము, ద్రోహాత్ముఁడగు భానుగుప్తునిగూఢచారిని కాలాగ్నిని ఖండఖండములుగాఁ గోసివేసితిమి. ఈద్రోహుని నాలుకపై వాఁతలువైచితిమి. కన్నులూడఁ బెఱికితిమి. కాన ద్రోహాత్ములందఱు జాగ్రత్తగా నుండుఁడు' అని యందుండెను.

తోర:—ఓహో! అలాగా? అయిన నాదుర్జనులు భానుగుప్తునిజీవములఁగూడ హరింపనున్నారా? ఔనా? పరాజితరాజబాంధవుఁడగు భానుగుప్తుఁ డీచోరులను రహస్యముగా లేవఁదీయుచున్నాఁడేమో యని సంశయించుచుంటిని. కాని నాయూహ సరికానందులకు సంతసముగానున్నది.

డిప్పుడు తనయాస్థానమునందు బికారియైయున్నాఁడుకదా యని మహాసేనుఁ డిప్పు డమందానందతుందిలుఁడై యున్నాఁడు. ఈహైందవోర్వీశుల యాశ్రితవాత్సల్యత్వ మెంతదురహంకారబంధురమైయున్నదో, దీనివలన దేవరవారికిఁ దెల్లమగుచున్నదిగదా. దేవా! సారాంశ మిది. బాలాదిత్యుఁడు మరలఁ దనచ్యుతరాజ్యమునఁ గొంతయైన నాక్రమించుటకు సాయమొనరించెదనని, మహాసేనుఁడు మాటయిచ్చియున్నాఁడు.

తోర:—ఓహో! ఏమి యీమహాసేనునిగర్వము! నాపైఁ గత్తిదూయుట కాతనికి మగతనమువచ్చెఁగా! ఔనా?

మిహి:—హూణులతోడిపోరాటమన నేమియో, మన మాతనికిఁ ద్వరలోఁ దెలియఁజేయుదము.

సర్వ:—దేవా! దీపకళికఁ జేరుశలభముమాడ్కి, మహాసేనుఁ డీయుద్ధప్రయత్నములకుఁ గడంగుచున్నాఁడు.

తోర:—మఱెవ్వరైన హైందవమేదినీశు లాతనికి సాహ్యమొనరింప నున్నారా?

సర్వ:—మహాప్రభూ! పైకిమాత్రము లేరు. కాని యెందరో భూకాంతులు లోలోన సాయమొనరింప మాటయిచ్చియున్నారు.

తోర:—వీరెంతసాహసులైరి. పిల్లులు పులులైనవిగా! ఆదుడుకనికి మహాసేనునకు సాయమొనరించుటకు వారికి గుండెలున్నవిగా? ఏయేరాజు లిందుకుఁ దెగించియున్నారు.

సర్వ:—దేవరవారిపరాక్రమపరిధికందకుండురాజులుమాత్రము సాహసించియున్నారు.

తోర:—ఎవరు వారు?

సర్వ:—వేఁగిదేశాధినాథుఁడు మహేంద్రవర్మ, కాంచీపురీశుఁడు అవంతివర్మ, సింహళాధీశుఁడు కాకవర్ణుఁడు, ఇంకను బాండ్య, చోళవంశీయులగు గొందఱురాజు లున్నారు. కాని లోలోన, చాటుచాటుగా సాయ

మొనరించువా రెందఱో గలరు. కళింగరాజపుత్రిక యగుచారుమతికిఁ ద్వరలో స్వయంవరమహోత్సవము జరుగుచున్నది. అప్పట్టున నచటికిఁ బెక్కురుభూమీశులు రానున్నారు. కేరళాధీశుఁడు మహాసేనుఁడునైత మాస్వయంవరమునకుఁబోయి, దేశకాలపరిస్థితుల నారసి, సాధ్యమైనంతవఱకు సాయమునుబడయనున్నాఁడు. గుణాకర, వ్యాఘ్రరాజుల సంపూర్ణసాహాయ్యమునుబడయుట కాతఁడు కృతనిశ్చయుఁడై యున్నాఁడు.

తోర:—స్వయంవర మెప్పుడు ?

సర్వ:—పైనెలలో మహాప్రభూ ! అందులకు దివ్యసన్నాహములు జరుగుచున్నవి. నలుబదియెనిమిదిదినములు వెయ్యిన్నినూటయెనిమిదిమంది బ్రాహ్మణులకు సమారాధనలుగావించి, భూరిసంభావనలచే వారిని సంతృప్తులఁ గావింతురఁట. రాజకుమారి చారుమతి కెనయగువిలాసవతి యాసేతుహిమాచలమునఁ గానరాదు. ఆమె సోయగ మలౌకికము. అసదృశము. ఆతరుణి పాణిగ్రహణమునకుఁ బోటీ లతిచుఱుకుగా నున్నవి.

తోర:—ఆరాజకుమారి యంతయందకత్తెయా ?

సర్వ:—దేవా! ఆప్రభుతనయ సౌందర్యసౌభాగ్యసౌశీల్యముల నభివర్ణించుటకు భాషయం దుపకరణములులేవు. ఆమె మహారాజ్ఞియై యుండఁదగియున్నది.

తోర:—అయిన మన మామె కెందులకు మహారాజ్ఞీపద మొసంగ రాదు? ఆసుందరాంగిని మన మిహిరగులునకు వివాహమొనర్చుట సమంజసముగదా ?

తోరమానునిసూచన సర్వసమ్మతునకుఁ దత్తరపాటొదవఁజేసెను. అంతలో నాతఁడు తెప్పిఱిల్లి "దేవా ! సామాన్యురాలగు కళింగరాజకుమారికిని, విశ్వవిఖ్యాతసామ్రాజ్యాధినాథునికుమారునకు నెంతయు నంతరముండును." అని పలికెను.

తోర:—అంతరమునకుఁ గలకారణము నాకు గోచరించలేదు. నా వంశవృక్షము హిందూదేశమునందు వ్రేళ్లునాఁటుకొనవలయునని నాయభిలాష. మిహిరగులుం డొకహైందవరాకుమారిఁ జేపట్టినచో, నాకోరిక నెఱవేఱును. సుప్రసిద్ధకళింగరాజతనూజ మాయింట మెట్టినయెడల, హూణులకీఁక హిందూదేశమునఁ గాలూని నిలుచుటకుఁ బట్టుచిక్కును. అప్పుడు మిహిరగులునకు బుట్టుపుత్త్రుఁడు విజాతీయుఁ డనిపించుకొనఁడు. అదియటుండ, మగధయందు మనయధికార మింకను జేవపాఱలేదని యందఱకుఁ దెలియుఁగదా! కానఁ గాళింగులస్నేహధనమున మాగధులభక్తిని విలుచుకొననగును. మహాకోసలము సంపూర్ణముగ మనచేతులఁ జిక్కిపోవును. ఈకళింగసంబంధము సర్వోత్తమమని యెన్నియోయేండ్లుగా నేను దలంచుచున్నాను. కుమారా! ఇందులకు నీయభిప్రాయమేమి?

మిహి:—దేవరవారిమతమును గాదందునా?

తోడనే తోరమానుఁడు, తుషష్పు, హుజేష్పు, వజేష్పులరావించి తన యభిమతమును వారి కెఱింగించెను. ఆయోజనకుఁ దుషష్పునుబట్టి పగ్గములు లేకపోయెను. కాని హుజేష్పు, వజేష్పు లందుల కియ్యకొనరైరి. జాతీతరులగుహైందవులతో వియ్యమందుటవలనఁ దమజాతి నానాఁట నిర్వీర్యమైపోవునని వారు భయపడుచుండిరి. "కరి కరిణిం బెండ్లాడువిధమున, హూణుఁడు హూణవనిత నుద్వాహమాడవలయును. కళింగులతోడివియ్యమువలన మనవీర్యము పటుత్వమొందునని దేవరవా రనుచున్నారుగదా! భీరుజనప్రధానమగుజాతితో సంబంధమొనరంచుటవలన, మనజాతికొదవు శౌర్యహాని నించుక తలంపుఁడు. అంతటఁ బులినిఁ జూచి నక్క వాఁతవేసికొనినట్లు, రాకుమారుని జూడఁబట్టి హూణులు నడతురు. ఇట్లు నూఱువత్సరములలో హూణజాతియంతయు హైందవజాతియందు విలీనమైపోవుట నిశ్చయము." అని వజేష్పు చెప్పెను.

తోర:—దానియందు నాకు లోప మగపడుటలేదు. పోఁదగినమార్గమునఁ బోవుట మంచిదిగదా!

వజేష్వ, హంజేష్వలు మఱేమియు వ్యాఖ్యాన మొనరింపలేకపోయిరి. వారు విధిలేక నోరుమూసికొనిరి.

హంజేష్వ:—మహారాజుగారిముదలను మాళిందాల్తుము. దేవరమాటను గాదన మే మెంతవారము?

వజేష్వ:—సాయాజ్ఞేపణలుంకూడ మాయమైనవి.

తోర:—మంచిది. ఇప్పు డీసంబంధము సానుకూలమగుమార్గము నరయ వలయుంగదా!

మిహి:—పరాక్రమోపేతమగు చమూసమూహము నిచ్చి నన్నుం బంపుండు. ఆరాజకుమారిని నేంబట్టుకొనివచ్చెద.

వజేష్వ:—ఇట్లుగదా నిజమగుహూణుండు పలుకును.

తోర:—కాని, ముస్ముందు మనము సౌమ్యరీతిం బ్రయత్నింతము. ఇట్టి సందిగ్ధసమయముల మనము కళింగకోపపన్నగముపైం గాలూను టాత్మ క్షేమంకరముగాదు.

మిహి:—పేదకోపము పెదవులచేటుగదా! కళింగులకోపము మనల నేమిచేయును?

తోర:—నిరర్థకముగావచ్చును! కాని దానికిం బ్రజాధనముల వ్యర్థముగా వెచ్చింపవలసివచ్చును. చతురుపాయముల మొదటి మూండుపాయములం బ్రయోగింతము. దాన నుపయోగములేకుండిన నాలుగవయుపాయమున్నదిగదా? కార్యసాఫల్యార్థము యుద్ధమునకుం గలసామర్థ్యము మఱిదేనికి లేదని, నీవయసున నేనుగూడం దలంచుచుంటిని. కాని వయోభారము భుజముల కెక్కినకొలంది నాయభిప్రాయమును మార్చుకొనుచుంటిని. జయాపజయములు మగంటిమిపై నాధారపడియుండునని నమ్మను. కాని నీతిప్రయోగమునం గలుగుఫలము వేఱు. సర్వసమ్మతా! మనయోజనలు ఫలప్రదములై యీ వివాహము జరుగుట కుపాయమేమైనం గలదా?

సర్వ:—దేవా! స్వయంవరమునకు యువరాజకుమారుఁబంపుటకు మారుగా నొకప్రతినిధినిఁ బంపుట యుక్తమని యీభృత్యునిమనవి. ఒకవేళ నాకుమారి యువరాజుగారిని నిరాకరించినయెడల, దాన మనయువరాజుగా రొందు నవమానభవము, వారచట లేమింజేసి, తేలికయైపోవును. వేఱొక వేళ నాసుందరాంగి యువరాజుగారిం బెండ్లాడ సమ్మతించినచో, దేవరవారు సపరివారముగాఁ బెండ్లికిఁ జననగును.

తోర:—కాని నాపుత్త్రునిఁ గాదనుట కారాకుమారికి గుండెలున్న వంటవా?

సర్వ:—దేవా! నేఁజెప్పఁజాలను. ఈరాజకుమారికలచిత్తము లహంకారపూరితములు. అట్టియెడ వారిచేష్ట లెవరికెఱుక? స్వయంవరనిర్ణయాధికారసూత్రము తెగువఱకు వారు లాగికాని వదలరు.

తోర:—అలాగైన మనము భానుగుప్తునిఁ బంపుట బాగు.

సర్వ:—అంతకన్నఁ గార్యకారి మఱేమున్నది. దేవా! దైవకృపవలన నాతఁ డిపుడు నగరమందే యున్నాఁడు. నేనిచటికివచ్చునపు డాతఁడు ప్రక్కగదియందు దేవరవారిదర్శనార్థము నిరీక్షించుచుండుట గాంచితిని.

తోర:—అయిన వానిఁ బిలువుము.

భటుఁ డొకఁడుపోయి, భానుగుప్తునిఁ బ్రభుసమ్ముఖమునకుఁ గొని వచ్చెను.

భాను:—దేవరవారిదివ్యచిత్తమున కానందకరమైన దేది?

తోర:—భానుగుప్తా! కళింగపట్టణమున రాజకుమారి చారుమతికి స్వయంవరము జరుగనున్నది. మిహిరగులునిప్రతినిధివై నీవాస్వయంవరమునకుఁ బోవలయును. ఆరాకుమారి యువరాజకుమారుని ప్రశస్తహస్తగ్రహణమున కియ్యకొనదేని, యుద్ధసన్నద్ధులైయుండుఁడని కళింగులతోఁ జెప్పిరమ్ము.

భాను:—దేవరవారియాజ్ఞను శిరసావహింతును. కాని, దిగంత కీర్తి విస్తారుఁడగు మనయువరాజునకుఁ గళింగరాజకుమారితోడి వివాహము, హూణప్రతిష్ఠకు భంగకరమని నావిన్నపము.

తోర:—కానే కాదు. హూణులు మీవలెగౌరవప్రతిష్ఠలపై నంతగాఁ బడిచావరు. మేము వర్ణవిభేదములఁ బాటింపము. అకారణమున మా మగఁటిమి చేవయెక్కియున్నది. మాజాతియందుఁ గులకట్టుఁబాటు లుండి యుండినచో, మీహైందవులకంటె మేము విక్రమాఢ్యులమై యెట్లుండెడి వారము.

భాను:—అదియటుండ, మఱియొకసంకట మున్నది. ఈకళింగులకు దురభిమానము మెండు. తామే యార్యులమని వారు విఱ్ఱవీఁగుచుందురు. అట్టియహంకారులు హూణులతోడివియ్యమున కియ్యకొందురా? యని నా సంశయము.

తోర:—అట్లు వారిబుద్ధి గడ్డిమేసినచో మనము వారికిఁ దగిన పాఠముఁ గఱపుదము.

భాను:—దేవరవారి చిత్తము.

అని భానుగుప్తుఁడు కొలువుపీడి యావలవచ్చెను. సర్వసమ్మతుఁడు కానుకలందిచి తోరమానుని సెలవుపొంది, బయటి కరుదెంచెను. ఇరువురుఁగలిసి కొంతదూరము పోయినతరువాత, సర్వసమ్మతుఁడు భానుగుప్తునిఁ గాంచి "ఆహాహా! ఎంతవిపరీతకాలమువచ్చినది. నిషాదాధముఁడును నాస్తికుఁడు నగు హూణుఁడెక్కడ ? కులాభిజాత్యసంపన్నయగు హైందవనారీశిరోమణి యెక్కడ? నక్కయెక్కడ? నాగలోకమెక్కడ?" అని నొచ్చుకొనుచుఁ బలికెను.

భాను:—ఇంతకుఁజిత్రమేమన, నీవివాహసంధానప్రక్రియ,నాకుత్తుక కురియై తగులొనినది. హూణుఁ డగువానికి నాపుత్త్రికనొసంగుటకుమాఱు చావనైనఁ జావ నియ్యకొనునేనే, నీతినియమవిహీనుఁడగు నానిషాదునకు సుక్షత్త్రియాంగన నిచ్చి పెండ్లిచేయుటకై ప్రయత్నించుచున్నాఁడఁగదా!

సర్వ:—అయిన దీని కీవేల యియ్యకొంటివి.

భాను:—నీకుఁ దెలియదా! నా రాష్ట్రము. హూణరాజ్యపుఁ బొలిమేర నానుకొనియున్నది. కాని వారిం బ్రతిఘటించి నిలుచుటవలన నాకు సౌఖ్యములేదు. ఆహా! ఈపాడుపశ్చిమమాళవమునకంటె, నేను మగధాధినాథుఁడనై యుండినచో, నెంతయు హాయిగా నుండెడిది.

సర్వ:—అది మనకెట్లు సాధ్యము? దైవ మిచ్చినదానితోఁ దృప్తినంది, హెచ్చుగాగోరక తనప్రాప్త మదియే యని తలంచి నిత్యసంతోషియై యుండుమానవుఁడే సర్వగుణోత్తముఁడు. వాఁడే ప్రజ్ఞావంతుఁడు.

భాను:—మంచిది. నాకిఁక సెలవు. అన్నట్లు మఱచితి. మహాసేనాది భూవరు లొకటికానున్నారని నీవంటివిగదా! వారియత్నము లెట్లున్నవి? వారు హూణు నూఁగింతురా?

సర్వ:—ఏమో, చెప్పఁజాలము. అంతయుఁ గళింగబాలాదిత్యులపై నాధారపడియున్నది. వారుభయులకు మైత్రి కుదిరిన, జయముకలుగుటకు సందియముండదు. లేకున్న, బాలాదిత్యాదులకు సర్వనాశము సిద్ధము. మఱేమియు లేదు.

భాను:—ఒకవేళ వారు హూణు నోడించిరేని మనయుభయులకుఁ గూడ సర్వనాశము సిద్ధము.

సర్వ:—దానికి నీవుమాత్రము దిగులొందనగుఁగాని, నాకు దిగులెందుకు? గూఢచారు, లేరాజునకుఁగాని కావలయును. రాజునకు గూఢచారులు కన్నులవంటివారుగదా! అందున నాయట్టిచతురమతియగుగూఢచారిని వారెన్నటికి విడనాఁడరు. మే మేగాలి కాచాపనెత్తుచుందుము. మసిపూసి మారేడుకాయఁజేయుటకు మేము వెనుదీయము. బూటకపుమగఁటిమిఁ బ్రకటించుటకు మేము సంసిద్ధులమైయుందుము. బక్కపీనుఁగులమగుమమ్ముఁ జూచి, భయపడువా రెవ్వరులేరు. కాని నీసంగతియే వేఱుసుమా!

భాను:—నిజము. కాలాగ్నిగతియేమైనదో నీవెఱుంగుదువా?

సర్వ:—నగరునకుఁ బోవుకతి నేఁడువింటిని. ఎవఁడో యొకదుర్మార్గుఁడు పగఁదీర్చుకొనుట కీపనిఁజేసియుండును. లేకున్నఁ జాతురీధురీణుఁడగు కాలాగ్నికేమి? ఇట్టి దుర్మరణము సంభవించుటేమి? సోదరగూఢచారి యెవ్వఁడైన నాతని యభ్యుదయమున కసూయపడెనో, మానవుఁ డెవ్వఁడైన దనరహస్యము లాతనికిఁ దెలిసినవని సంశయించెనో, కాలాగ్నిని మట్టుపెట్ట నెంచి యాతనియుదంతమునంతయుఁ దొంగలకుఁ దెలిపియుండవలయును. లేకున్న, వారాతనిసంశయింప వారికి వేఱువెరవెక్కడిది?

భాను:—ఆదొంగలు నాకుఁగూడ నొకబెదరింపుజాబును వ్రాసిరి. నీకిది తెలియునా?

సర్వ:—అవునఁట. వింటిని. ఆహా! హూణునియనుగ్రహసంపాదనమున కెట్టియుక్తిఁ బన్నితివయ్యా నీవు.

భాను:—(కోపముతో) ఏమి! ఆజాబును నేనే వ్రాయించితినని నీవు తలంచుచున్నావా?

సర్వ:—లేదు లేదు. తత్తఱపడకుము. ఆజాబు నీప్రేరణచే వ్రాయఁబడినదని నేను వింటిని.

భాను:—దేనింజూచి, నీవింత తెగువతోఁ బలుకుచున్నావు?

సర్వ:—దేనింజూచియా? కాలాగ్నిఖండితశిరము నీబసలోఁబడిన ముందటిదినము నీసేవకుఁడు విశ్వనాథుఁడు హరిరాముని యడవులనుండి తిరిగి వచ్చుచుండెను. నేనుగూడ గూఢచారిననియు జగజ్జెగీయమానుఁడననియు, నావులించినఁ బ్రేవులెంచునిపుణుఁడననియు దేవరవారు మఱచితిరికాఁబోలు.

భానుగుప్తుఁడు పెదవులఁ గఱచుకొనెను. "ఈ నీయనుమానములను గోరంతలు కొండంతలుగాఁజేసి, హూణునకు నివేదింప వనుకొందును." అని భానుగుప్తుఁ డుస్సురనుచుఁ బలికెను.

సర్వ:—అంత యవసరమేమివచ్చినది? నీవు నాకేమియుఁ గీడొనరించినవాఁడవుకావు. అట్టియెడ నేను నీకుఁ గీడుఁదలంచుటకుఁ గారణమేమి.

కలదు? సరియగు కారణముండినఁదప్పఁ మేమొకరిమనసు నొప్పించుట కిష్టపడము. అటియటుండ, కుత్తుకమీఁదికిఁ గత్తివచ్చినపుడు, మాకు సాయమొనరించువా రుండరు. ఇది తెలిసి, మేము సాధ్యమైనవఱ కితరులజోలికిఁబోము. ఏదియెట్లున్న నేమి? కాలాగ్నిగతిఁ గన్నులారఁగాంచియు, దేవరవారి జోలికి వచ్చుటకు నాకు మతిపోయినదాయేమి? కాని యొక్కవిషయము. నేను దరిద్రుఁడను. కూటికిగుడ్డకు వాఁచియుందును. సమయాసమయముల నాకడుపు కాలునపుడుమాత్రము, తమరు నన్ను 'అయ్యో!' అనుచుండినఁజాలును. 'దేహి' యనిన 'నాస్తి' యనుట గుప్తవంశీయు లెఱుంగరుగదా!

భాను:—కావలసినది కైకొనుటకు నీకాటంకములేదు. మంచిది. పోయివచ్చెద.

సర్వ:—నాకును సెలవు.

వారు చెరియొకదారిఁ బోయిరి.

రాజాజ్ఞపైఁ బోయివచ్చినసుమతి, నాఁటిసాయంకాలము తోరమాన మిహిరగులులసన్నిధికి వచ్చెను. సుమతి బోగముది. మంతుకెక్కిన గూఢచారిణి. స్కందగుప్తసార్వభౌముని సామంతరాజులు కొందఱాతని యెడఁ గుట్రలొనరించుచుండ, నాతఁడు వారిదుశ్చేష్టితములఁగనిపెట్టనెంచి, కొందఱుగూఢచారులఁ జేరఁదీసి యావృత్తి కవసరము లగుతంత్రములను వారికిఁ గఱపెను. ఆగూఢచారులలో నీసుమతియు నొక్కతె. సుమతి సంగీతవిద్యయందుఁ బ్రవీణురాలు. నాట్యకళయం దప్రతిమురాలు. కేశసంస్కరణమొనరించి, రాకుమారితలమనసులఁ జూఱఁగొను నేర్పఱి. పూలమాలలఁ గట్టుటయం దతి నిపుణురాలు. ఈయోగ్యలతో నావేశ్యాంగన శాత్రవరాజాంతఃపురతరుణులఁజేరి, తనకళాపాటవమున వారిమానసము లాకర్షించి, వారు తన్నించుకేని సంశయింపకుండునట్లు, తనకుఁ గావలసినసంగతులను వారికడనుండి ముక్కలుముక్కలుగా నొలుచుకొనుచుండును. తనకుఁ గావలసిన విషయమంతయు దొరకినతర్వాత, నాగూఢచారిణి తనకు సమీప

తోర:—కానే కాదు. నీవింకను వెక్కు కానుక లందందగినదానవు. మనకన్నులది మ్ముకొట్టి, ఉజ్జయినినుండి యశోధర్మ యానాఁ డెట్లు తప్పించుకొనెను? భూమకాంతకుఁ డేమయ్యెను?

సుమతి:—దేవా! యశోధర్మ భూమకునికో అలకుఁ జిక్కి మడియనుండ, బాలాదిత్యుఁడు దాకని రక్షించి, వీరకేసరి భూమకునిఁ గాలునిమందిరమునకు గెంటివైచినాఁడు.

తోర:—ఏమీ! భూమకాంతకుఁ డాపోగరుఁబోతు బాలాదిత్యుఁడా!

సుమతి:—అవును దేవా! అనంతరము యశోధర్మ బాలాదిత్యులుజ్జయినియందొకయింటఁ దలఁ దాఁచుకొనిరి.

తోర:—ఎవరియిల్లు?

సుమతి:—దేవా! చండాలిని మాధవికుటీరము.

తోరమానుఁ డదరిపడెను. "అయ్యో! పాపిష్ఠదైవమా! ఆయింటిని మాత్రము నేము వెదుకమైతిమి. ఇందుల కానారాయణశర్మయే కారణము. ఆదుష్టుర్గునియాత్మను భగవానుఁడు నాశమొనరించుఁగాక! పొండు. పోయి, యాద్రోహాత్మురాలిని మాధవిఁ జుట్టుపట్టుకొని యీడ్చుకొనిరండు. ఆనీచురాలి నాహుతిఁగొనువఱకు మాకోపాగ్ని చల్లాఱదు," అని తోరమానుఁడు కోపతామ్రాక్షుఁడై, తనభటుల కాజ్ఞ చేసెను.

సుమతి:—దేవా! మన్నింపుము. ఆమాలది మొన్న చనిపోయినది. దేవరవారిసన్నిధికి వచ్చునప్పుఁ డీసంగతి వింటిని.

తోర:—అయిన దానిశవమును గుక్కలకు వేయుదము. పోయి, సమాధిత్రవ్వి శవముఁ గొనిరండు.

సుమతి:—ఆమెశవమును దహించిరి. ఆమె యస్థులను నలువైపుల కెగఁజల్లిరి.

తోర:—అయిన నాకపటాత్మురాలు తప్పించుకొనినదా? పోనీ! ఆమెకు బిడ్డలులేరా? వారి దుంపతెంచెదను.

సుమతి:— దేవా! ఆమెకు బిడ్డలులేరు.

తోర:—అయిన నామూలదానియింటిని దగులఁబెట్టి, యచట నొక గుంటఁద్రవ్వుఁడు. ఇప్పుడే నూఱుగురుభటులు పోయి, దానిగుడిసెకు నిప్పు పెట్టవలయును. ఇకపై ద్రోహులకును, శత్రువులకు నాప్రదేశ మాశ్రయ మియ్యకుండుఁగాక!

మిహిరగులుఁడు నూఱుగురుసైనికుల నాపనిపైఁ బంపెను. తోరమానుఁడు కోపము నణఁచుకొనెను. "బాలాదిత్యయశోధర్ముల వెదకుటకై, యాధేయుఁడగు వాసుదేవునిఁ బంపియుంటిని. ఆతనిగతి నీకేమైనఁ దెలియునా?" ఇంతవఱ కాతనిపోవడిలేదు. వాఁడు కృతఘ్నుఁడయ్యెనా? అని యాతఁడడిగెను.

సుమతి:—ఆతనిముక్కున నూర్పుండునంతవఱ కాతఁడు మీకుఁ గృతజ్ఞుఁడైయుండెను. ఒకధర్మశాలయం దాతఁడు యశోధర్మను గలిసికొనెను. యశోధర్మ వెంట మఱిపలువురుండిరి. కాని యట్టియెడ విషప్రయోగమే కార్యకారియని వాసుదేవుఁడు భావించెను. కాన నాతఁడు ధర్మశాలాధికారి యగు కమలాక్షునకు లంచమిచ్చి, వానిని లోఁబఱచుకొని, త్రాగెడునీటిలో దారుణవిషమును గలుప వాని నియ్యకొనఁజేసెను. వసంతయను నొకగొల్ల చిన్నది, జోక్యము కలుగఁజేసికొనకపోయినచో, నాకార్యము నిరంతరాయముగఁ గొనసాగియుండెడిది. ఆగొల్లదానివలన నంతయుఁ జెడిపోయినది. వెంటనే వాసుదేవుఁడు బంధింపఁబడి నిరాయుధుఁడుగాఁ జేయఁబడెను. వాసుదేవకమలాక్షు లొక్కగుఱ్ఱముపైఁ గట్టఁబడిరి. యశోధర్మవసంతలు మఱియొకవాజి నెక్కిరి. బంధితులు కూర్చుండియుండినగుఱ్ఱపుఁగళ్లెమును బట్టుకొని యశోధర్మ తనయశ్వమును నడిపించుచుండెను. మార్గమధ్యమున నొక కొండకాలువ యడ్డుతగిలెను. అది గట్టొరసి పాఱుచుండెను. దానిపైనివంతెన యిఱుకుగానుండెను. వాసుదేవకమలాక్షులవారువమును ముందుపోనిచ్చి, తన గుఱ్ఱమును యశోధర్మ దానివెనుకఁ బోనిచ్చుచుండెను. వాసుదేవుఁ డున్నట్లుండి "నేను ఖైదీనై యుండనేరను." అని యఱచి గుఱ్ఱము నొకతన్ను

తన్నెను. తోడనే యాహయము బెదరి, దబాలున నాకాలువలోఁబడెను. కమలాక్షుఁడు "అయ్యో! రక్షింపుఁడు. రక్షింపుఁడు. దానిసనైనమానె, నా ప్రాణములుండినఁజాలును" అని యేడువసాగెను. కాని ప్రయోజనమేమియు లేకపోయెను. యశోధర్మ వసంత లింతలో నావలికూలముచేరిరి. వారాగుడ్డి వెన్నెలయందు, నిర్ఝరిణీనీలాంబువులఁ గన్నార్పక చూచుచు నిలిచియుండిరి. వంతెనప్రక్కనుండి సుడిగుండములోఁబడి నిముసములసేపు బుడకలుపుట్టు చుండెను. నీరు పైకెగురుచుండెను. గుఱ్ఱమందుఁబడి కొన్నుకులాడుచుండెను. దానిఁగట్టియుండినత్రాళ్లు బిగువుగానుండుటచే, నవి తెగినవికావు. బరువును మోయఁజాలకగుఱ్ఱము నీటిలోనికిఁ గ్రుంకిపోవుచుండెను. వాసుదేవుఁడు పెదవియైనఁ దెఱచినవాఁడుకాఁడు. అతఁ డేమియుఁబలుకలేదు. కాని కమలాక్షుఁడుమాత్రము 'అయ్యో! మోఁటో!' అని కొట్టుకొనుచుండెను. "అయ్యో! నన్నుఁగాపాడుఁడు. దానిసీఁదనైనను బ్రతికియుండినఁజాలును" అని యాతఁడు మొత్తుకొనుచుండెను. ఆసుడిగుండ మంతలో నాహయమును దానిబరువును తనపొట్టఁబెట్టుకొనెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను.

తోర:—అయిన నాపీరోత్తముఁడు పాడుచావుచచ్చినాఁడు.

సుమతి:—దేవా! ఈయౌధేయులపౌరుషము మీకనుభవములేదు. వారికి స్వాతంత్ర్యాభిలాష మెండు. దాస్యవృత్తిని వారేవగించుచుందురు. పౌరుషైకధనుఁడగువాసుదేవునకుఁ గలాంజారునందలి బంధజీవనమసహ్యమై యుండెను. యశోధర్మసయితము వాసుదేవునిసాహసమునకు నిర్విణ్ణుఁడయ్యెను. అతఁడు వసంతఁ గాంచి "మానినీ! ఈతనికిఁ జావునందుండు తెగువ, బ్రదుకు నందుండినచో, నీతనిబంధింప నాకు శక్తియుండెడిదికాదు. ఈతఁడు సుక్షత్రియునివోలె మృత్యువును వలచినాఁడు" అని పలికెను.

తోర:—ఈయంశములన్నింటిని నీవెచట బీజారితివి?

సుమతి:—దేవా! వసంత చెప్పినది.

తోర:—ఏమీ! నీవు వసంతను వలలో వేసికొంటివా? ఆమె కలాంజారునం దేమిచేయుచున్నది?

సుమతి:—యశోధర్మ తల్లియగు మహారాణి మహామాయకు వసంత చెచ్చెలియై యున్నది. అదియుఁగాక, యశోధర్మ కాగొల్లది సకలకార్యములఁ గుడిభుజమై యున్నది.

తోరమానుఁ డాశ్చర్యమొందెను. "అయిన నీవు యశోధర్మమర్మ భేదన మొనరించివచ్చితివి? కలాంజారుపరిమాణ మెట్టిది? ఆదుర్గరాజము నించుక వర్ణించుము?"

సుమతి:—దేవా! ఈవిషయమునమాత్రము నేను మీకాశాభంగ మొనరింపక విధిలేదు. ఆమాయావి వసంత నాకంటె మఱినాలుగాకు లెక్కువ చదివియున్నది. యశోధర్మ నాకోరిక కభ్యంతరముచెప్పలేదు. కడకు మహామాయకూడ నందుల కంగీకరించినది. వసంత—ఆవసంతయొక్క తెమాత్రము "మగవారిపనులలో మనకు జోక్యమేల? దుర్గమునఁ గ్రొత్తలేమున్నవి? ప్రాకారరహితమగు విశాలప్రదేశమైననేమి? ప్రాకారరక్షితమగు ప్రదేశమైననేమి? మన కాజోక్యమేల? రెండును మనకు సౌఖ్యదాయకములే గదా?" అని పానకములోని పుడకవలె నడ్డుతగులుచుండును. కడకు సముద్రగుప్త సార్వభౌముఁడుకూడ లోఁబఱచుకోఁజాలనిదుర్గ మెట్లుండునా? యని వినోదార్థముచూడ నెంచితినని నేను బదులిడితిని.

"వినోదములఁ జూడ నెంచుట స్త్రీలకు సహజముకాదా? కాని యింత యవసర మేమున్నది?" అని వసంత యనుచుండెడిది. మూఁడుదినములాగి నే నీవిషయమై మరల నామెతోఁ బ్రస్తావింప ఇంతవేగిరమేల? నీవు మమ్ము వీడిపోవుటలేదుగదా? పోవుదువాయేమి?" అని యామె నవ్వెను. నేనుగూడ నామెతోఁ గలిసి నవ్వితిని. తరువాతఁ గొన్నాళ్లకు కామెకడ నీసంగతియెత్తితిని. అందుల కామాయావిని మరల "ఈకోటనుజూడ నీకంత కోరికయేల? ఇచటఁ గనీస మొకవత్సరముండినఁగాని, యీదుర్గము నెవ్వరును జూడ నర్హులుగా రనునియమ మున్నది" అనెను. "వసంతా! ఎన్నియో మాఱులు నీ వీదుర్గమును గాంచియున్నావు. కాని నీవిచటికివచ్చి కొన్నినెల

లైన గాలేదు. దీని కేమందువు? అని నేను నవ్వుచు నడిగితిని. "అవును. నేను నీవు కాదుకదా?" అని యామె నవ్వుచు నన్నెత్తిపొడిచి "యశోధర్మరాజేంద్రుని ప్రాణముల నేను గాపాడి రాజానుగ్రహమునకును, మహారాణి మహామాయదయకుఁ బాత్రురాలనై యున్నాను" అని ప్రత్యుత్తర మొసంగెను. ఈమాటలకు యశోధర్మ మహామాయలు మందహాస మొనరించిరి. మాటిమాటికి నేను బ్రశ్నించుచుండినచో వారు నన్ను సంశయింపకపోయిరని తలంచి మరల వసంతతో నావిషయమై ప్రస్తావింపనైతిని. ఒకటిరెండు సారులు నాకోరికను మహామాయకును, కడకు యశోధర్మకును దెలియఁబఱచితిని. అందులకు వారు నాకోరికను డాకచేసి, వసంత మహాకోసలమునకు సర్వాధికారిణియనియు, నామె సమ్మతిలేక యెట్టిపనిగాని జరుగదనియు ననిరి. యశోధర్మ మహామాయలను నేను బ్రార్థించితినని, వసంత చెప్పులఁబడెను. కలాంజారు మర్గపుమర్మముల గ్రహింపవలయుననికదా నాయభిప్రాయము. నాఁటితో నాకోరిక కూలిపోయెను. ఒక్కనాఁ డామె యశోధర్మతో నన్నుగుఱించి "ఆవృద్ధురాలు స్వయముగ సజ్జనురాలు. కాని ముసలులనోట మాటదాఁగదు. ఊరక వారు వదరుచుందురు. కొన్నిసమయముల వారిచేతులకుఁ దీఁటపట్టి గులగులలాడుచుండుటయుఁ గలదు." అని చెప్పుచుండ, నేను జెవులార వింటిని. అంతకుపంత్రకుశల యావసంత!

తోర:—కాని యాదుర్గమునకుఁ బోవుదారినైన, నీవు చూచియుండు వనుకొనియెద. ఇంతవఱకైనఁజాలును.

సుమతి:—ఈవిషయమునఁగూడ దేవరవారి కాశాభంగ మొదవఁ గలదు. మహాకోసలమున నమలాపురియను నొకచిన్నపట్టణమున్నది. నేనచట యశోధర్మఁగలిసికొని నాసంగీతనాట్యకౌశలముల నాతని కెఱుకపఱచుకొని, కుసుమదామములఁ గట్టుటయందును, కురులు సవరించుటయందును, మహారాణి మహామాయగారి కుపయోగింతునని మనవిచేసికొంటిని. నాకళాప్రావీణ్యమునుగుర్తించి, మహామాయవసంతలు నన్నుఁ బెద్దదాసిగాఁ జేయుయుద్దేశముతో

నగరులోనికిc దీసికొనిపోయిరి. అప్పుడే హూణులు మహాకోసలముపైcబడ నున్నారని వార్తవచ్చెను. తోడనే మేమందఱము, శత్రుదుర్భేద్యమగు కలాంజారుదుర్గమునకుc బోనెంచితిమి. నేను గాలిలో మేడలcగట్టుచుంటిని. అరిజనభయంకరమగు నిట్టిదుర్గమును జేరుమార్గము నరయcగల్గుదునుగదా యని నే నుప్పొంగుచుంటిని. కాని మాపయనము నిశాసమయమునc జరుగ నున్నదని నేనంతలో వింటిని. నేను మహామాయకడకుcబోయి "రాత్రికాల మున మహారాణిగారు జాగర మొనరింపcజాలరు. కానc బగటిపయనము శ్రేష్ఠముగదా?" అని చెప్పితిని.

ఆముసలిరాణి కేcబడియేం ద్గుండును. నాపలుకుల కామె విషాద ఖిన్నమై "అమ్మా! జాగరములు నాకు నేcడు క్రొత్తలుగావు. సుజనశిఖామణి యగు స్కాందగుప్తుcడు పరాజితుcడైననాcటినుండి, నాజీవితాకాశము దుఃఖాంధకారబంధురమైపోయినది. ప్రకాశాదిత్యునిమరణము తోలుకాఱు మబ్బులు పుట్టసాగినవి. బాలాదిత్యుcడు మగధనుండి వెడలcగొట్టcబడి, కేరళ మునకుc బ్రవాసముపోయినంతనే యాకాఱుమబ్బులు విస్తరిల్లి నలుగడల నలముకొనినవి. నాకుమారుcడును, నేను దిక్కులు తెలియక పలాయనసూత్ర ములc బఠించుచు నీదుర్దినములc గడపుచున్నారము. ఎన్నికష్టములువచ్చిన నేమి? స్వేచ్ఛాగౌరవములకు లోటురాకుండినచో, వానినిc గష్టములుగాc దలంపము. పగటిపూటc బయన మొనరించు టాపదలకుమూలము. కాన మేము సాధారణముగ నిశాసమయములందుc బయన మొనరించుచుందుము." అని సమాధానమిచ్చెను: ఆమాటలతో నాయాశ లడుగంటినవికావు. చీcకటి రాత్రులైననేమి? బహిరంగముగనుండు మాపల్లకినుండి మార్గమును గుర్తుపట్టc గలుగుదు ననునాయాశాజ్యోతి నామానసమున మినుకుమినుకు మనుచుండెను. కాని వసంత యంతలో నొక్కమాఱుగా నాయాశాజ్యోతి నూcదివైచెను. ఆమాయలాడి, పల్లకిచుట్టును మందమగుతెరలుదించి గట్టిగాc గట్టివేయవలయు నని పట్టుపట్టెను. నేనించుక తెగువcజేసికొని "లోనికి గాలి వెలుతురు రావ

లదా?'' అంటిని. అందుల కాగొల్లది ''మొదట జీవితమునకే మోసమువాటిల్లి యుండ గాలి వెలుతురుల సంగతి యిపు డెవరికిఁబట్టినది?'' అని చెప్పెను.

నేను:—మనకుఁ బ్రాణభీతియేల?

ఆమె:—మ్లేచ్ఛులు భరతవర్షమున నిలిచియున్నంతకాలము, మనకుఁ బ్రాణములపై నాశయెక్కడిది?

నేను:—పల్లకిచుట్టును దెరలఁగట్టుకొని రాత్రికాలమునఁ బయన మొనరించినచో, మనము పిఱికిపందలమని నలుగురు నవ్వరా? మనమట్టికళంక మును యశోధర్మకుఁ దేరాదు.

తోర:—సెబాస్. సెబాస్. అందుల కామె యేమనినది?

సుమతి:—'ఓహో! భద్రపడుట పిఱికితనము కానేరదు' అని వసంత యనినది. అంత నేను ''మూసినపల్లకీలలోఁ బయన మొనరించుట నాకలవాటు లేదు. కాన నన్ను వట్టిపల్లకిలోఁ రానిమ్ము'' అని యడిగితిని. కాని యా మాయావిని యందుల కియ్యకొనక ''నీవు మాచెలిమి నభిలషించితివేని, నీవు కూడ మాయభ్యాసముల నలవఱచుకోవలయును. ఇట్టిప్రస్తావ మిప్పుడే యొదవుటకు నాకు సంతోషముగానున్నది'' అనెను. ఇఁక నేనేమి చేయఁ గలను? ఏమియుఁ బలుకక యూరకుంటిని. పొదవి తెఱచి పలికినను వారు నన్ను వెడలనడిపింతురేమో యనుభయమున, మూసినవారియందే పోవుటకు నేను సమ్మతించితిని. దుర్గమునకుఁబోయినపిదప వారివిశ్వాసమునకుఁ బాత్రు రాలఁ గావచ్చుననియు, వారి నప్పుడు నాకు దుర్గమునుజూపునట్లు బలవంత పెట్టుటయేకాక, రహస్యమార్గములను సులభముగాఁ జూడ వీలుండుననియు నూఱడిల్లితిని. నేను, వసంతమహామాయలకు విధేయురాలనై వర్తించుచు, వారు 'నంది' యనిన 'నంది' యనియు, 'పంది' యనినఁ 'బంది' యనియుఁ గాలము వెళ్లఁదీయుచు వారిమనసున కెక్కి నడచుకొనుచుంటిని. నాగానకళా ప్రావీణ్యమునకు, మాల్యరచనాకౌశలమునకు, వేణీబంధనచాతుర్యమునకు,

వసంత విస్మయమందుచుండెడిది. తనకీకళలఁ గఱప నన్నామె ప్రార్థించెను. కాని నేనుమాత్రము "ఈవిద్యలు నీకేల! ఎప్పుడు కావలయుననిన, అప్పుడు నేనున్నానుగదా!" అని యామెను బుజిమిపుచ్చితిని. కాని యాగొల్లది యావులించినఁ బ్రేవులెంచునది. ఆమె నాతో "ఓకరుణా! (మహాకోసలమున నాపేరిది) నీమేన నూపిరియుండునంతవఱకు, నీవు మాకుఁ దోడునీడవై యుందువనుట నిస్సంశయము. కాని యీపనులకు నీయనంతర మెవరున్నారు? నీవు ముదుసలిదానవు. నీస్థానము నాక్రమించుటకు నీయనంతరము మఱి యొకరుండవలయుఁగదా! నిన్నాశ్రయించియుండు నిరుపమకళాప్రావీణ్యము నంతటిని, నీతోడనే యంతరింపఁజేయుట కరము శోచనీయముగదా! యశో ధర్మ మహారాజన్యుని పట్టమహిషి కుపచారములొనరింప నీయట్టివా రెవరో యొకరుండవలయుఁగదా! నేను పసిదానను. నీపాదములకడ విద్య నభ్యసింప నాకభిలాషగలదు. దయచేసి యీకళల నాకుఁ గఱపుము." అని నన్ను బతిమాలెను. వసంత ప్రార్థన నంగీకరింపనగునని మహామాయకూడ నన్ను బ్రే రేపించినది. ఆమెయాజ్ఞను బాలింపక నాకు విధిలేకపోయెను. నాకార్యసాను కూలముకొఱకు నే నామెయానతిని మాళిఁదాల్చితిని. వసంత విద్య నేర్చుకొన మొదలిడెను. కుశాగ్రబుద్ధియగు నాశిష్యురాలిఁ గాంచి నాకు విస్మయభయము లొదవెను. ఇట్లొక నెలలోపల నాగొల్లచిన్నది నాట్యకళను, పుష్పమాలికా నిర్మాణచాతుర్యమును, వేణీబంధనకౌశలమును గ్రహించెను. కాని గానకళ యందుమాత్రము నాప్రావీణ్యమును నే నీక్షణమువఱకు నిలుపుకొనియు న్నాను. కాని యీపాండిత్యము నిష్కళంకమై, నిరుపమానమై, సర్వజన రంజకమై యుండెడిదికాదు. ఏలయన, నాప్రేతయౌవన మామెకు సాయ కారియైయుండెను. నే నామెఁ బాండిత్యమునఁ దలఁపన్నుచుంటిని. కాని యాగోపిక నవయౌవనాంగియై తనకంఠస్వరమాధురీమహిమచే శ్రోతలకుఁ గర్ణరసాయన మొనరించుచు, వారిమెప్పు లందుచుండెను. ఇట్లామె యహో రాత్రములు విద్య నభ్యసించుచుండెను.

తోర:—ఆమెకీకళాభ్యసనమునందుఁ గలపట్టుదలకుఁ గారణము లారసితివా?

సుమతి:—అది దైవమునకే యెఱుక. అంతయోపికను, జిజ్ఞాసను, నేనిప్పటికిఁ జూచియుండలేదు. ఆటక్కులాడి యేదియో పన్నాగముఁ బన్నియున్నది. ఇదిమాత్రము నిశ్చయము. వేళకానివేళలఁగూడ నే నాకన్నియకు విధిలేక విద్యనేర్పవలసివచ్చినది. అచట నామెపెట్టినది భిక్షయగుటంజేసి, నే నామె మదికెక్కి వర్తించుచుంటిని. కాని యెట్టులో యొకట్టుల నామెకడ నుండి భూమకునివృత్తాంతమును, వాసుదేవునివార్తను గ్రహింపఁగలిగితిని.

తోర:—ఇంకేమైన గ్రహించితివా?

సుమతి:—ఆహా! యశోధర్మ, ఈనస్వామియుఁ బ్రభువు నగుబాలాదిత్యునకుఁ జాపమతిని సంధానమొనరించు ప్రయత్నమునఁ గళింగమునకుఁ బోనున్నాఁడు.

తోర:—ఓహో! ఆలాగా? ఆరాజకుమారిని మనమిహిరగులునకు సంధానపఱచునిమిత్తము, భానుగుప్తునిఁ గళింగమునకుఁ బంపనున్నాను. నీకిది తెలియునా?

సుమతి:—తెలియును. కాని దేవరవారి కాశాభంగమొదవునేమో యని నాభయము. ఈహైందవరాకుమారికలు రూపమదాంధలై, మిన్నుమన్నుఁగానక వర్తించుచుందురు. హూణులనిన వారికి సింహస్వప్నము. వీర లోకాలంకారుఁడగు హూణప్రభుతనయుని పాణిగ్రహణమునకు వారియ్యకొనకపోవుటయేకాక, మీఁదు మిక్కిలి యాసంబంధము నతిహీనమని యేవగించుకొనుచుందురు.

తోర:—ఇది మిక్కిలి చిత్రముగానున్నది.

సుమతి:—దేవా! ఇట్టిదేశముల కిట్టినడవడులు చిత్రములుగావు. ఈదేశమే మిగులఁ జిత్రమైనది. అట్టియెడ నిందలిచర్యలుకూడ, విచిత్రము లనుటలో నాశ్చర్యమేమికలదు? దేవరవారియడుగులకు మడుఁగులొత్తుచుపొట్ట

దారిని గమనింప నెంచి, తెరను దొలఁగింపఁబోయితిని. నే నెంతయో శ్రమించి, మా ప్రయాణము వెన్నెలరాత్రులయందు జరుగునట్లు చేసితిని. కాని యిచటఁ గూడ నామాయలాడి నాకడ్డుతగిలినది. నేను తిన్నగాఁ జెరకడకుఁ బోవునంతలో వసంత "నీకేమికావలయును?" అని నన్నడిగినది. 'చల్లనిగాలిని సేవింప వలయును' అని నేను బదులిడితిని. అందుల కామె "ఓహో! ఆతెరఁ దీయకుము. మహారాణిగారికి జలుబుచేయును" అనెను.

నేను:—ఉక్కపోయుచున్నది. మహారాణిగారికి జలుబు చేయునని నే ననుకోను.

మహా:—కుమారీ! వసంతా! నాకు జలుబుపట్టదు లెమ్ము.

సుమ:—ఆమాటలకు నాకపరిమితానంద మొదవెను. కాని వసంత "ఆత్మసౌఖ్యప్రదములగుపరికరముల మహారాణిగారెఱుంగరు. దేవిగారియంగరక్షకురాలనుగాఁ బ్రాణపరిపోషకురాలనుగా నేను నియమింపఁబడియున్నాను కాదా?" అని మహామాయ నడిగెను. అందులకు మహారాణి మందహాస మొనరించుచు "అమ్మాయీ! నీయిచ్చవచ్చినట్లు కానిమ్ము" అనెను. దాన నా యాశాజ్యోతి యొక్కమాఱుగా నారిపోయెను. అంత నేను జిత్తమును శాంత పఱచుకొని యాపాదుపల్లకిలోఁ గూర్చుండి "ఆహా! నేఁబోవుదారి యెట్టిదో పరికింప నేనువ్విళ్లూరుచుండియుం పాపిష్ఠదైవ మందుల కనుగ్రహింపఁ డయ్యెఁగా," అని యనుకొనుచుఁ బోవుచుంటిని. ఆక్షణమునుండి వసంత నాకు శత్రువైనది. ఆమె పేరెత్తిన నాహృదయము భగ్గుమనుచుండును.

తార:—మంచిది. వసంత కళింగపట్టణమునఁ బన్నఁబోవుచున్నాగ మేమైయుండును?

సుమతి:—చెప్పఁజాలము. కాని యాగొల్లభామ నాకడ నభ్యసించిన కళాపాటవమున, రాజకుమారి చారుమతి యనుగ్రహమును జూఱఁగొనఁగల దని నేఁ దలంచెద.

తోర:—ఆకళిలలో నామెకంటె నీవే ప్రవీణురాలవుగదా! కాన నిన్నుఁ గళింగరాజు గుణసాగరునికొలువునకుఁబంపి, వసంత నచటినుండి పంపి వేయుట మిగుల సులభము. సముచితముకూడ.

సుమతి:—ఆగొల్లదానితోడికయ్యమునకు నే నేమాత్రము వెనుకంజ వేయను. యశోధర్మమహామాయలవలె, గుణసాగర, దాక్షాయణీ, చారుమతులుఁ వసంతగీచినగీఁటును దాఁటకుండువారుకారు. కాన నీమాఱు మా పోరాటము తీవ్రతరమైయుండును.

తోర:—అయిన నేఁడే బయలుదేఱుము. ఇవిగో, ఈవేయిబంగారు నాణెములఁ గైకొనుము. గుణసాగరునియాస్థానికిఁబొమ్ము. పోయి చారుమతిని నీమాయాజాలములఁ జిక్కించుకొనుము. చిక్కించుకొని, మనమిహిరగులుని వరించున ట్లారాజకుమారిపై మచ్చుమందుచల్లుము. సాధ్యమైనంతవఱకు వసంత కంపకములగునట్లు చూడుము. మహాసేనాదినరేంద్రమండలి హూణుని పైఁ గావించుకుట్రపై నొక కన్నుంచియుండుము.

అని తోరమానుఁ డాగూఢచారిణి కొకబంగారునాణెములసంచిని బహూకరించెను.

సుమతి:—దేవా! అచట రాజసేవకులకును, మఱియవసరమని తోఁచినవారికెల్ల లంచములిచ్చుటకుఁ గొంతధనము కావలసియున్నది.

తోర:—ఔనౌను. మఱచితి. చక్కగా జ్ఞప్తిపఱచినందులకు సంతసమైనది. ఇవిగో, తీసికొను మీమూఁడువేలబంగారునాణెములు.

అని యాతఁ డామెకుఁ బెద్దమూట నొసంగెను. సుమతి యాసంచులను, ౪౫౦౦ బంగారునాణెము లుండువానిని గ్రహించి "మహాప్రభూ! నాకును వసంతకును దీఱనిపోరు ప్రారంభమైనది. నాసామర్థ్యమునంతయుం ధారవోసి, యీకార్యమునఁ గృతకృత్యనయ్యెద." నని విన్నవించెను.

తోర:—నీమాటలచే నాకు మితిలేని యానందమైనది.

అనంతరము సుమతి మహారాజుకడ సెలవుగొని వెడలిపోయెను.

ఇరువదిదినములుజరిగెను. ఒకనాఁడిరువురువ్యక్తులు కళింగపట్టణము నుండి జావాద్వీపమునకుఁబోవు నావపై నెక్కియుండిరి. వారిలో నొకఁడు పురుషుఁడు. మఱియొకతె స్త్రీ. ఆస్త్రీపురుషులు సమానవయస్కులని చెప్ప వచ్చును. ఆనౌక సాగరమధ్యమునం దొంటరిగఁ బయనమొనరించుచుండెను. చందమామ వెన్నెలలవెదఁజల్లుచు నడిమింటఁ బ్రకాశించుచుండెను. అసంఖ్యాకతారకాగణసంశోభితమై, భావగర్భితమైయుండు నీలాంబరమును నేత్రపర్వముగా నవలోకించుచు, నాస్త్రీపురుషులిరువురు నౌకోపరితలమున సుఖాసీనులైయుండిరి. ఆపురుషుఁడాయువిదఁగాంచి "ఆహాహా! సుమతీ! పాపపంకిలమగు గూఢచారిజీవితమునకు, నీశాంతిసముజ్జ్వలజీవితమునకు నెంతవ్యత్యాసమున్నదో చూచితివా? దీనికన్న మిన్నయగుశాంత్యాశ్రమము నేఁటిలోం డేమికలదు. ప్రశాంతమునకు నిలయమును, గాంభీర్యమునకుఁ బట్టుకొమ్మయు నగుప్రకృతికాంత నిట్టిసాగరమధ్యమున నొకమారైన సందర్శించినచో, మరల రాజకీయకర్దమమునఁ గాలూనుటకు బుద్ధిపుట్టునా?" అని పలికెను.

ఆస్త్రీవ్యక్తి మనకుఁ బరిచితురాలగుసుమతియే. ఆమాటలకా వెలయాలు ముసిముసినవ్వులనవ్వుచు "ఓసర్వసమ్మతా! సర్వజ్ఞుఁడగుభగవానుఁడు మనకిట్టిజీవితపరమావధిఁ గల్పించియున్నాఁడు. పరస్పరద్వేషభూయిష్ఠమును, దుఃఖాంధకారబంధురము నగుభరతవర్షమునకు నీళ్లువదలి, నూతనదేశమునందు వినూతనజీవితారంభసంరంభులమై యుండుట మనకెంతయో శ్రేయస్కరమై యున్నది." అని బదులిడెను.

"మోహనాంగీ! నీమాట లెంతయుం నిజము. భరతవర్షమునందుఁ బ్రబలియుండువర్ణవిభేదములు మనకల్యాణమున కడ్డుతగులుచు, మనసంసారసౌఖ్యమును జెఱుపుచుండెను. కాని జావాద్వీపనివాసులకు వర్ణవిభేదములు లేవు. ఒకవేళ నుండినను, భారతీయులకుఁబోలె వారికి సంఘవ్యత్యస్తములయం దంతపట్టుదల యుండదు."

"కాని మనయనురాగబీజ మింతయాలస్యముగా మొలకెత్తుటకై నాకుఁ జింతగానున్నది."

